# నోరూరించే... మనసుదోచే... మైమరపించే.






క్రొత్త పార్లే

# పాపిన్స్

## పండ్ల రుచిగల పిప్పరమెంట్లు

5 పండ్ల సువాసనలలో 13 మధురమైన బిళ్ళలు-
తక్కువ వెలగల మక్కువ గొలిపే ప్రతి ప్యాక్‌లో—
నిమ్మ, మూసంబి, నారింజ, అనాస మరియు రాస్ప్‌బెరీ!

## ఆ పండ్ల మజా తెలుసుకోండి పాపిన్స్ నారగించండి-

everest/122/PP tel

# ఫ్లోరైడ్ పిప్పిపళ్ళ రాకుండా కాపాడుతుంది కనీసం 50 ఏళ్ళ వయసు వరకూ

(రస్సెల్ మరియు ఎల్‌వోవ్ 1951లో చేసిన అధ్యయనము—
'సైంటిఫిక్ ఆర్టికల్స్' పేజి 305, ఏనల్స్ ఆఫ్
ది రాయల్ కాలేజ్ ఆఫ్ సర్జన్స్ ఆఫ్ ఇంగ్లండ్,
నవంబర్ 1969, వాల్యూమ్ 45 (నం. 5 నుంచి)

## అందుకే బినాకా వారు తయారు చేసే టూత్‌పేస్ట్‌లో ఫ్లోరైడ్ ఉంటుంది

ఎందువల్లనంటే బినాకా ఫ్లోరైడ్‌లో గల సోడియమ్-
మోనో-ఫ్లోరో-ఫాస్ఫేట్ (యస్‌యమ్‌ఎఫ్‌పి) వలన
దంత రక్షణే గాక, పిప్పి పళ్ళు ఏర్పడకుండా చేస్తుంది;
పంటి ఎనామిల్ గట్టిపరుస్తుంది. నోటిలో తయారయ్యే
ఏసిడ్ తయారు కాకుండా చేస్తుంది.
దంతక్షయాన్ని అరికట్టుతుంది.
బినాకా ఫ్లోరైడ్ వాడటానికి బలమైన కారణాలు ఇవన్నీ.
రోగ నివారణకన్నా అరికట్టటం మేలని నమ్మే
టూత్ పేస్ట్ ఇది.






బినాకా ఫ్లోరైడ్‌తో దంతక్షయాన్నుంచీ,
బాధించే పిప్పి పళ్ళ నుంచీ మూడు
రకాలుగా రక్షణ లభిస్తుంది.

C I B A Cosmetics

CF. 31 TL

అయ్యలు, అమ్మలు, పిల్లలు
పక పక పక పక పక పక పక పక పక
కిల కిల కిల కిల కిల కిల కిల కిల కిల
నవ్వే చిత్రం!

# జాతకరత్న మిడతంభొట్లు

## దర్శకత్వం పద్మనాభం





SK:P

ఆంధ్ర, సీడెడ్: లక్ష్మీ ఫిలింస్, నైజాం: శ్రీ పద్మా పిక్చర్స్

# చందమామ

సంస్థాపకుడు : నాగిరెడ్డి
సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ నెల బేతాళకథ ["నేరస్థుడు"] పంపినవారు జ్వాలాచంద్రిక. ఈ కథలోని నీతి ఎల్లకాలాలకూ వర్తిస్తుంది. రాజు తన పరిపాలనలో అక్రమ మార్గాలు తొక్కినప్పుడు దాని దుష్ఫలితాలు అట్టడుగుదాకా దిగుతాయి. ఎందు చేతనంటే, న్యాయంగానూ, నీతిగానూ, ధర్మంగానూ బతకాలన్న కోరిక గలవారు సయితం పరిస్థితుల ప్రభావం చేత వక్రమార్గాన నడవవలసి వస్తుంది.

"సజ్జనుడి పాట్లు" అన్న పెద్ద కథ ఈ సంచికతో పూర్తి అవుతున్నది.

సంపుటి 49 నవంబర్ '71 సంచిక 5

CHITRA



# అమరవాణి

నాస్తి కామసమో వ్యాధి, ర్నాస్తి మోహసమో రిపుః,
నాస్తి క్రోధసమో వహ్ని, ర్నాస్తి జ్ఞానాత్పరం సుఖమ్. 1

[కామంతో సమానమైన వ్యాధి, మోహంతో సమానమైన శత్రువూ, క్రోధంతో సమానమైన అగ్నీ, జ్ఞానాన్ని మించిన సుఖమూ లేవు.]

క్రోధో మూల మనర్థానాం, క్రోధః సంసారబంధనమ్,
ధర్మక్షయకరః క్రోధ, స్తస్మాత్ క్రోధం విసర్జయేత్. 2

[కోపం అన్ని అనర్థాలకూ మూలం, సంసార బంధనం, ధర్మక్షీణం కలిగిస్తుంది. అందు చేత క్రోధాన్ని విడిచిపుచ్చాలి.]

క్రోధో హి శత్రుః ప్రథమో నరాణాం,
దేహస్థితో దేహవినాశనాయ,
యథా స్థితః కాష్ఠగతో హి వహ్నిః,
స ఏవ వహ్ని ర్దహతే శరీరమ్. 3

[మనుషులకు కోపం ప్రథమ శత్రువు. కట్టెలలో ఉండే నిప్పు కట్టెనేకాల్చినట్టు, కోపం శరీరాన్ని కాల్చేస్తుంది.]

క్రోధము



# సర్వసమత్వం

పూర్వం సింహపురినగరంలో ఒక యోగి ఉండేవాడు. ఆయన వెంట కొందరు శిష్యులు కూడా ఉండేవారు. ఆ యోగి అప్పుడప్పుడూ రాజు వద్దకు వచ్చి, ధర్మం గురించీ, నీతి గురించీ మాట్లాడి, రాజుకు ఎంతో మనశ్శాంతి కలిగిస్తూ ఉండేవాడు. అందుచేత రాజుకు ఆ యోగి పైన ఎంతో భక్తీ, విశ్వాసమూ ఉండేవి.

ఆ యోగిని రాజు తన దగ్గిరే ఉండి పొమ్మనీ, ఆయనకూ, ఆయన శిష్యులకూ కావలిసిన సదుపాయాలన్నీ తాను చేస్తాననీ అన్నాడు.

కాని యోగి అందుకు సమ్మతించక, "రాజా, రోజూ అయిదు ఇళ్ళలో భిక్ష స్వీకరించి, దానితో పొట్ట పోసుకోవటం నా నియమం. ఎంతో కాలంగా యీ నియమం పాటిస్తున్నాను. నేను తేరగా దొరికిన తిండి తినేవాణ్ణి కాను." అన్నాడు.

యోగి ఇలా అన్నమీదట రాజు ఒక చాటింపు వేయించి, యోగీ, ఆయన శిష్యులూ ఎవరి ఇంటికి వచ్చినా వారు భిక్షవేయాలని పౌరులను హెచ్చరించాడు. ఆ కారణంగా యోగికీ, ఆయన శిష్యులకూ సులువుగా భిక్ష దొరుకుతూ ఉండేది. ఇది చూసి, తిండికి కూడా లేనివాళ్ళు అనేక మంది యోగి దగ్గిర శిష్యులుగా చేరి, ఆయనతో బాటు తిరగసాగారు.

ఒకనాడు యోగి భిక్షం కోసం బయలుదేరి ఒక సారాదుకాణం వద్ద తన శిష్యబృందంతో సహా నిలిచాడు. సారాదుకాణం వాడు బయటికి వచ్చి, "స్వామీ, లోపలికి దయ చెయ్యండి. కాని నా వద్ద మీకు ఇవ్వటానికి సారా తప్ప ఏమీ లేదు." అన్నాడు.

యోగి లోపలికి వెళ్ళాడు. సారాదుకాణం వాడు యోగికి ఒక ముంతతో సారా ఇచ్చాడు.

ఎస్. సత్యనారాయణాచార్యులు

"కృష్ణార్పణం," అని యోగి ఆ సారాను ఒక్కగుక్కలో తాగేశాడు. తమ గురువుగారు తాగారు గదా అని ఆయన శిష్యులు కూడా దుకాణం లోపలికి పోయి, తలా ఒక గ్లాసు సారా తాగేశారు.

ఈ సంఘటన వల్ల రెండు ఫలితాలు కలిగాయి. యోగి వెంట ఉన్న శిష్యులలో చాలామంది సారారుచి మరిగి తాగుబోతు లయిపోయారు.

మరొకటి ఏమిటంటే, యోగి సారా తాగాడనీ, ఆయన శిష్యుల మని చెప్పుకునే వారు పట్టి తాగుబోతులనీ విని, రాజు ఆ యోగిని ఇకముందు తన భవనానికి రానివ్వ వద్దని తన ద్వారపాలకులకు ఉత్తరువు ఇచ్చాడు.

యోగిని గురించి ప్రజలలో చాలా దుష్ప్రచారం జరిగింది. ఆయన భిక్ష సంపాదించ టానికి ఎంతో సేపు, ఎన్నో ఇళ్ళముందు నిలవపలిసి వచ్చింది. ఈ గడ్డు పరిస్థితులకు తట్టుకోలేక, ఆయన శిష్యులు ఒకరొకరే వెళ్ళిపోయారు.

అయితే ఆయన తనకు పూర్వం ఉండిన ఖ్యాతి గురించి పట్టించుకోనట్టే, ఇప్పుడు వచ్చిన అపఖ్యాతి గురించి కూడా పట్టించుకో లేదు.

కొన్ని రోజులు గడిచాక యోగి భిక్షకోసం తిరుగుతూ ఒక కంసాలిదుకాణం ముందు నిలబడ్డాడు.

ఆయనను చూసి కంసాలి వెటకారంగా, "స్వామీ, నా దగ్గిర ఇవ్వటానికి ఏమీలేదు. మూసలో కరిగిన బంగారం ఉన్నది, పుచ్చు కుంటారా?" అన్నాడు.

యోగి, "తే, నాయనా!" అని, కంసాలి పట్కారుతో అందించిన మూసను అలాగే చేత్తో పట్టుకుని, "కృష్ణార్పణం," అంటూ ఆ మూసలోని బంగారాన్ని ఒక్కగుక్కలో తాగేసి, ముందుకు సాగిపోయాడు.

ఈ అద్భుతవార్త రాజుకు తెలిసింది. ఆయన యోగి మహత్తుకు ఆశ్చర్యపోయి, స్వయంగా యోగిని వెతుక్కుంటూ వచ్చి, ఆయన కాళ్ళపైనపడి, క్షమాపణ చెప్పుకున్నాడు.






# ఆరవ దొంగ

ఒకప్పుడు ఉజ్జయినీనగరంలో దొంగల బాధ ఎక్కువయింది. రాజుగారి రక్షక భటులు ఎంత ప్రయత్నించినా దొంగలు దొరకలేదు. వాళ్ళు గొప్ప తెలివితేటలు గల వారి లాగా కనిపించారు. తమను దొంగల బారి నుండి కాపాడవలసిందన్ని, ధనికులు రాజు గారికి మొరపెట్టుకున్నారు. రాజు దొంగలను పట్టటానికి తానే ప్రయత్నించా లని నిశ్చయించుకుని, పౌరులకు అభయం ఇచ్చి పంపేశాడు.

అర్ధరాత్రివేళ ఆయన మారువేషం వేసు కుని, నాలుగు మార్గాల కూడలిలో నిలబడ్డాడు.

కొంతసేపటికి ఆ ప్రాంతానికి ఒక్కొ క్కరుగా నలుగురు మనుషులు వచ్చి చేరారు. రాజు వారిని సమీపించి, "నేను కూడా మీ లాంటి దొంగనే. మీ మీ ప్రత్యే కతలు ఏమిటో నేను తెలుసుకోవచ్చునా?" అని అడిగాడు.

"నేను ఎలాంటి గోడకైనా కన్నం వేయగలను," అన్నాడు మొదటి దొంగ.

"నాకు ఏ ప్రాణి చేసే ధ్వని కైనా అర్థం తెలును," అన్నాడు రెండో దొంగ.

"తాళం వేసి ఉన్న పెట్టెలను పైనుంచి వాసన చూసి, ఆ పెట్టెలలో ఏ యే పదార్థా లున్నదీ చెప్పగలను," అన్నాడు మూడో దొంగ.

"ఒకసారి విన్న కంఠస్వరాన్ని నేను ఎన్ని ఏళ్ళకైనా గుర్తించగలను," అన్నాడు నాలుగో దొంగ.

ఇలా చెప్పి వాళ్ళు రాజును, "మాతో స్నేహం చేస్తున్నావు గనక, నీ ప్రత్యేకత ఏమిటో మాకు కూడా చెప్పు," అన్నారు.

"నాతో ఉండే దొంగ లెవరికీ మరణశిక్ష పడదు," అని రాజు ఆ దొంగలతో అన్నాడు.

తరవాత అయిదుగురూ కలిసి దొంగ తనానికి బయలుదేరారు. ఆ రాత్రికి ఎక్కడ

జె. వినాయకరావు

కన్నం వెయ్యాలన్న ప్రశ్న వచ్చింది. రాజ మందిరంలో దొంగతనం చేద్దామని రాజు అన్నాడు. ఇందుకు మిగిలిన నలుగురూ సమ్మతించారు.

అందరూ రాజభవనాన్ని చేరుకున్నారు. మొదటి దొంగ కన్నం వేయనారంభించాడు. ఇంతలో నక్క కూసింది.

"ఆ కూతకు అర్థమేమిటి?" అని రాజు రెండో దొంగను అడిగాడు.

"గృహయజమాని మేలుకునే ఉన్నాడట," అన్నాడు రెండో దొంగ.

అంతలోనే గుడ్లగూబ అరిచింది. దానికి అర్థమేమిటని రాజు అడిగాడు.

"గృహస్థు మనని గమనిస్తున్నాడట," అన్నాడు రెండో దొంగ.

దొంగలు తమ కార్యక్రమం నిలిపి, కుక్కిన పేనుల్లాగా, నిశ్చలంగా ఉండి పోయారు.

అంతలో ఒక కుక్క మొరిగింది. వెంటనే మరో కుక్క మొరిగింది.

"అవి ఏమంటున్నాయి?" అని రాజు రెండో దొంగను అడిగాడు.

"మొదటి కుక్క మనని వెళ్ళిపొమ్మంటున్నది. రెండోది మొదటిదాన్ని నోరు మూసుకోమని మందలిస్తున్నది," అన్నాడు రెండో దొంగ.

"శకునం బాగాలేదు. ఈ పూటకు మరొక చోటికి పోదాం" అన్నారు దొంగలు.

"మీ కేమీ భయం లేదు. ప్రారంభించిన పని పూర్తి చెయ్యండి. మీ ప్రాణాలకు



నా ప్రాణం అడ్డువేస్తాను. పిరికి పడకండి, నా మాట నమ్మండి," అని రాజు వారిని ప్రోత్సాహపరిచాడు. రెండో దొంగ తెలివికి ఆయన చాలా అబ్బురపడ్డాడు.

తమ కొత్త మిత్రుడి కన్న పిరికివాళ్ళు మనిపించుకోవటం ఇష్టం లేక దొంగలు తాము ప్రారంభించిన పని పూర్తి చెయ్యటా నికే నిశ్చయించారు. మొదటి దొంగ కన్నం వెయ్యటం అయిపోయింది.

దొంగలకు రాజభవనంలో ఆరుపెట్టెలు దొరికాయి. మూడో దొంగ వాటిని వాసన చూసి, "మన అదృష్టం ఇవాళ బాగున్నది. ఈ పెట్టెల నిండా రత్నాలూ, మణులూ, బంగారమూ లాటి విలువగల వస్తువు లున్నాయి," అన్నాడు.

అయిదుగురు దొంగలూ అయిదు పెట్టెలు తీసుకుని, ఆరో పెట్టెను కన్నం వద్దనే వదిలి పెట్టి, అక్కడి నుంచి బయలుదేరారు. మర్నాడు రాత్రికి తిరిగి అందరూ ఫలానా చోట కలుసుకునేటట్టుగా సంకేతం ఏర్పాటు చేసుకుని, దొంగలు ఎవరి ఇళ్ళకు వారు వెళ్ళిపోయారు. రాజు తన భవనానికి తాను వచ్చేశాడు.

తెల్లవారింది. రాజభవన రక్షకుడు ప్రాంగణమంతా తిరుగుతూ, దొంగలు వేసిన కన్నం చూసి ఆశ్చర్యపోయాడు. లోపల ఉండవలసిన అయిదు పెట్టెలు లేవు: ఆరవది, దొంగలు పొరపాటున వదిలినట్టుగా, కన్నం దగ్గిర ఉన్నది. రక్ష కుడు దాన్ని సంగ్రహించి తన ఇంటో దాచి



పెట్టి, తిన్నగా రాజు వద్దకు వెళ్ళి, "మహారాజా, మనం ఎంత జాగ్రత్తగా ఉన్నా, రాజభవనంలో రాత్రి దొంగలు పడి, ఆరు నగలపెట్టెలను ఎత్తుకు పోయారు," అని విన్నవించాడు.

రాజుకు ఆరో దొంగ ఎవరో తెలిసి పోయింది. "ఇవాళ దొంగలు దొరికి పోతారులే," అని ఆయన రక్షకుణ్ణి పంపేశాడు.

ఆ రాత్రి సంకేత స్థలంలో, అనుకున్న ప్రకారం చేరిన దొంగలను నలుగురినీ రాజభటులు పట్టుకున్నారు.

ఆ మర్నాడు రాజు సభలో దొంగలకు అందరికీ మరణదండన ప్రకటించాడు.

ఆ మాట విని, రాజును తమ కొత్త స్నేహితుడని పోల్చుకున్న నాలుగో దొంగ, "మహారాజా, నిన్న రాత్రి మేము దొంగతనం చేసినప్పుడు మా వెంట మరొక దొంగ ఉన్నాడు. తన వెంట ఉండే దొంగలకు మరణదండన ఉండదని ఆయన మాతో అన్నాడు. ఆయన తన ప్రత్యేకతను రుజువు చేసుకో లేదు. మీ రిచ్చే మరణదండన ఆయనకు కూడా వర్తిస్తుందా?" అని అడిగాడు.

ఆ మాట విని రాజు నవ్వుతూ, "మీ వెంట ఉన్న అయిదో దొంగ తన ప్రతిజ్ఞ తప్పక నిలబెట్టుకుంటాడు," అని దొంగలతో అని, సభికుల కేసి తిరిగి, "ఆ అయిదో దొంగను నేనే. నేను వీరి మరణ దండనను రద్దు చెయ్యటమే గాక, వీరు దొంగిలించిన పెట్టెలను వీరికి బహుమానంగా ఇస్తున్నాను. ఎందుకంటే, వీరు చాలా శక్తులు గలవారు. ఇక నుంచీ వీరు నా కొలువులో చేరి దొంగతనాలు మానేస్తారు. పోతే ఆరో దొంగ కూడా ఉన్న సంగతి మీ కెవరికీ తెలియదు. ఈ రాజభవన రక్షకుడే ఆ ఆరోదొంగ," అన్నాడు.

రాజభవన రక్షకుడి ముఖం వెల వెల పోయింది. రాజభటులు వెళ్ళి రక్షకుడి ఇల్లు సోదా చెయ్యగా ఆరో పెట్టె దొరికింది. రాజు రక్షకుడికి మరణదండన విధించక, దేశబహిష్కార శిక్ష విధించి, ఆ పనిని తన మిత్రులైన దొంగలకు ఇచ్చేశాడు.





# 14

[చెట్టు దగ్గిర కాపలా వేసి వున్న మహేంద్రనగరసేనాని కొడుకును, ఖడ్గజీవదత్తులు హడలగొట్టారు. అతడు సైనికులతో పాటు పారిపోయాడు. గంద్రగొడ్డలి యువకుణ్ణి చెట్టు తొర్రలోనే వదిలి, ఖడ్గజీవదత్తులు ఉత్తరంగా ప్రయాణంచేసి, ఒక నీటివాగును చేరారు. ఆ వాగు అవతల కొందరు సైనికులు వాళ్ళను హఠాత్తుగా చుట్టుముట్టారు. తరవాత—]

ఖడ్గ జీవదత్తులు, అశ్వికసైనికుల కేసి వింతగా చూస్తూ నిలబడిపోయారు. వీళ్ళు మహేంద్రనగరం వాళ్ళేమో అన్న అనుమానం కలిగింది, జీవదత్తుడికి. అశ్వికుల్లో ఒకడు, ఈటెను పైకెత్తి, "మా వెంట రాజుగారి దగ్గిరకు రండి! ఊc, అలా చూస్తారేం, కదలండి!" అన్నాడు.

ఖడ్గవర్మ చప్పున కత్తి దూయబోయాడు. కాని, జీవదత్తుడు అతణ్ణి ఆగమని, అశ్వికుణ్ణి, "మీ రాజెవరు? మీరు మహేంద్రనగరంవాళ్ళా?" అని అడిగాడు.

"ఎక్కడ మహేంద్రనగరం, ఎక్కడ మా ఆనందపుర రాజ్యం! మా రాజు నిత్యానందుడు. మీ విఘ్నేశ్వరపూజారి రోజులు దగ్గిర పడ్డాయి! ఇన్నాళ్ళూ తప్పించుకున్నాడు," అన్నాడు అశ్వికుడు.

"విఘ్నేశ్వరపూజారి ఎవడు? మీ రేదో పొరబడుతున్నారు. మేం అతడి మనుషులం




కాదు. మా దారిన మమ్మల్ని వెళ్ళనీయండి!'' అన్నాడు జీవదత్తుడు.

'' ఈ కల్లబొల్లి మాటలు మా రాజే నమ్మడు, నేను నమ్ముతానా? పదండి రాజుగారి దగ్గిరకి. ఊఁ,'' అన్నాడు అశ్వికుడు యీటెను ఝుళిపిస్తూ.

''ఖడ్గా,- వీళ్ళు మనను గురించి పొరబడుతున్నారు. రక్తపాతం ఎందుకు? వీళ్ళ రాజుతో మనం ఎవరిమైందీ చెప్పి, మన దారిన మనం పోదాం!'' అన్నాడు జీవదత్తుడు.

తరవాత ఖడ్గజీవదత్తులు, సైనికుల వెంట రాజు నిత్యానందుడి దగ్గిరకు వెళ్ళారు. నిత్యానందుడు వాళ్ళను నఖశిఖపర్యంతం ఓ సారి పరీక్షగా చూసి, ''ద్రోహి విఘ్నేశ్వర పూజారి ఏ కొండగుహలో వుంటున్నాడు? వాడి కున్న ఆటవిక మూక ఎంత? రాకాసిఏనుగును వాడు ఎలా మచ్చిక చేయగలిగాడు?'' అని అడిగాడు.

ఈ ప్రశ్నలు జీవదత్తుడికి ఎక్కడలేని కోపాన్ని తెప్పించినై. అయినా అతడు దాన్ని పైకి కనబరచకుండా శాంతస్వరంతో, ''రాజా! తమ రడిగిన ప్రశ్నల్లో ఏ ఒక్క దానికీ మాకు జవాబు తెలియదు. మేం తీర్థయాత్రలకై పోతున్న క్షత్రియ యువకులం!'' అన్నాడు.

''యువకులని తెలుస్తూనే వుంది! కాని క్షత్రియులం అనే మాటా, తీర్థయాత్రల మాటా నమ్మటం ఎట్లా?'' అన్నాడు రాజు వెటకారంగా.

''ఇదిగో, ఇప్పుడు నీ చేత అదంతా నమ్మిస్తాం!'' అంటూ ఖడ్గవర్మ కత్తి దూశాడు. అదే సమయంలో అల్లంత దూరంలో వున్న చెట్లచాటు నుంచీ, రాళ్ళ చాటు నుంచీ కొందరు ఆటవికులు డాళ్ళూ, కత్తులూ పట్టుకుని, ''విఘ్నేశ్వర పూజారికీ, జై!'' అంటూ రాజు వున్నచోటుకు పరిగెత్తి రాసాగారు.

నిత్యానంద రాజు రథం మీదనే వుండి, ''నరకండి శత్రువులను! చంపండి శత్రువులను!'' అంటూ అరిచాడు.



సైనికులు ఈటెలు ఎత్తి ఆటవికుల కేసి దూకబోయేంతలో, ఎదురుగా వున్న ఒక మిట్ట మీదికి ఒక రాకాసి ఏనుగు వచ్చి నిలబడింది. అది ప్రమాణంలో రెండు ఏనుగులంత వున్నది. దాని మీద విఘ్నేశ్వర పూజారి తల పైన కిరీటం పెట్టుకుని కూర్చుని వున్నాడు.

రాకాసిఏనుగును చూస్తూనే నిత్యానందుడి సైనికులు గడగడ వణికిపోయి, చప్పున వెనుదిరిగి పారిపోసాగారు. ఆటవికులు వాళ్ళను తరుముతూ, రాజు వున్న రథాన్ని సమీపిస్తున్నారు. రాజు పెద్దగా గొంతెత్తి, "మహాశూరులైన ఆనందపుర సైనికులు తమ రాజునే రక్షించుకోలేరా? ఏమిటా పిరికితనం! ఆటవికుల్ని ఎదిరించండి!" అంటూ అరవసాగాడు.

ఈ గలభాలో రథానికి కట్టివున్న గుర్రాల్లో ఒకటి బెదిరి, రథాన్ని పక్కకు లాగింది. రెండవ గుర్రం రథాన్ని సమీపిస్తున్న ఆటవికుల్లో ఒకళ్ళిద్దర్ని వెనకకాళ్ళతో గట్టిగా తన్నింది. తన సైనికులు తన రక్షణ సంగతి గాలికి వదిలి పారిపోతూండటం; తను విఘ్నేశ్వరపూజారి వేగులవాళ్ళనుకున్న యువకులిద్దరూ కదలామెదలక నిలబడి వుండటం చూసి రాజు, "ఓ క్షత్రియ యువకులారా, మీరు పూజారి మనుషులు కాదని తెలుసుకున్నాను. నన్ను వాడిచేత బడకుండా కాపాడారంటే, మీకు నా ఆస్థానంలో పెద్ద పెద్ద పదవులిస్తాను!" అన్నాడు.

రథం మీద భయంతో వణికిపోతున్న రాజునూ, అతన్ని పట్టుకునేందుకు ముందుకు వస్తున్న ఆటవికుల్నీ, దూరాన మిట్ట మీద నిలబడి వున్న రాకాసి ఏనుగునూ చూసి, జీవదత్తుడికి రాజు పైన జాలి కలిగింది. అతను ఖడ్గవర్మను హెచ్చరిస్తూ, "ఖడ్గా, సంగతి సందర్భాలేమిటో తరవాత తెలుసుకుందాం. ముందు మనం ఈ రాజును రక్షించాలి. ఆ రాకాసి ఏనుగు మీద కూర్చున్నవాణ్ణి చూస్తుంటే, నా కెందుకనో ఒళ్ళంతా తేళ్ళూ, జెర్రులూ పాకుతున్నట్టుంది!" అని చేత నున్న దండాన్ని



ముందుకు చాచి, ఆటవికుల్ని ఎడా పెడా కొడుతూ ముందుకురికాడు.

ఖడ్గవర్మ తన మిత్రుణ్ణుంచి యిలాంటి ప్రోత్సాహం ఎప్పుడు వస్తుందా అని కత్తి దూసి ఆటవికుల కేసి చూస్తూ నిలబడి వున్నాడు. జీవదత్తుడు తన దండంతో ఆట వికుల మీదికి దూకటం చూస్తూనే అతడు ఒక సింహనాదం చేసి, మెరుపులా పోయి ఆటవికుల మీద పడి, వాళ్ళను ఊచకోత కోయసాగాడు.

చచ్చినవాళ్ళనూ, గాయ పడినవాళ్ళనూ వదిలి మిగిలిన ఆటవికులు భీతితో అరుస్తూ, రాకాసి ఏనుగు వున్న దిక్కుకు వేగంగా పరిగెత్తసాగారు.

ఇది చూసి నిత్యానందరాజు సంతోషంతో ఉప్పొంగిపోయి, "ఆహా, ఏం క్షాత్రం! ఏం శౌర్యం! యిద్దరే యిద్దరు యువకులు, యమదూతల్లాంటి యింతమంది ఆటవికుల్ని ఎదుర్కొని తరిమికొట్టటమా! ఇలాంటిది నేను కథల్లో, వీరగాథల్లో చెప్పగా విన్నాను గాని, కంటితో యీనాటి వరకూ చూడ లేదు," అన్నాడు.

"ఇప్పుడు చూశారు గనక, ఇక మీ దారిన మీరు, మీ నగరానికి వెళ్ళండి! వేటవ్యసనం కొద్దీ యీ అరణ్యాలకు వచ్చి మీరు చిక్కుల్లో పడి, మా బోటివాళ్ళను చిక్కుల్లో పెట్టకండి," అన్నాడు జీవదత్తుడు.

"మా నగరం వచ్చి, నే నిచ్చే బహుమానాలు స్వీకరించకుండానే వెళతారా? మీకు నా ఆస్థానంలో ఉన్నత పదవులు కూడా యిద్దా మనుకున్నాను!" అన్నాడు రాజు.

"మాకు ఆ బహుమానాలూ, పదవులూ అవసరం లేదు. మేము తీర్థయాత్రలు చేస్తూ కాలం వెళ్లబుచ్చ దలిచాం. ఇక సెలవు!" అంటూ జీవదత్తుడు, ఖడ్గవర్మ కేసి తల తిప్పి చూశాడు.

ఖడ్గవర్మ తన కత్తికి పట్టిన నెత్తురును వదిలించుకునేందుకు, దాన్ని ఒక పొద మీది ఆకులతో రుద్దుతూ, రాకాసి ఏనుగు కేసి కళ్ళార్పకుండా చూస్తున్నాడు. చావగా మిగిలిన ఆటవికులు ఆ ఏనుగు దగ్గిర చేరి,

దాని మీద కూర్చుని వున్న విఘ్నేశ్వర పూజారితో ఏమో చెపుతున్నారు. పూజారి వాళ్ళతో మాట్లాడుతూ, మధ్య మధ్య తల తిప్పి ఖడ్గ జీవదత్తుల కేసి చూస్తున్నాడు.

జీవదత్తుడు ఖడ్గవర్మను సమీపించి, "ఖడ్గా, నీ కత్తికి మళ్ళీ పని పడేలావుంది. ఆ ఏనుగు మీద వున్నవాడి వాలకం చూస్తూంటే, వాడు తిరిగి ఆటవికుల్ని మన మీదికి తోలేలా వున్నాడు." అన్నాడు.

జీవదత్తుడు మాటముగించే లోపలే గుట్ట మీద వున్న రాకాసి ఏనుగు ఒక్కొక్క అడుగే వేస్తూ కిందికి దిగసాగింది. అది తన కాళ్ళను కదిలిస్తున్న తీరు చూసి ఖడ్గవర్మ ఆశ్చర్యపోతూ, "జీవా! ఇదే జాతి ఏనుగు? ప్రమాణంలో రెండు ఏనుగు లంత వున్నది. అది నడుస్తున్న తీరు చూశావా? అప్పుడే పుట్టిన ఏనుగుపిల్లలా కాళ్ళు అడ్డదిడ్డంగా వేస్తున్నది. దాని తొండం కదలటంలేదు. బిర్రబిగుసుకు పోయిన ట్టున్నది." అన్నాడు.

"ఇది అసలు ఏనుగేనా అన్న అను మానం నాక్కలుగుతున్నది, ఖడ్గా!" అంటూ జీవదత్తుడు, నిత్యానందుడి కేసి చూశాడు.

ఇప్పుడు నిత్యానందు డున్న రథం మీద గుర్రాలను అదిలిస్తూ ఒక సారథి కూర్చుని వున్నాడు. వాడు రథాన్ని వెనక్కు తిప్పే



ప్రయత్నంలో వున్నాడు. సైనికులు చాలా మంది ఒక గుంపుగా అంత దూరంలో నిల బడి రాకాసిఏనుగు కేసి కళ్ళింత చేసుకుని చూస్తున్నారు. వాళ్ళు ఏ క్షణంలో అయినా అక్కణ్ణించి పారిపోయేందుకు తయారుగా వున్నారని జీవదత్తుడు గ్రహించాడు.

జీవదత్తుడు పెద్దగా గొంతెత్తి, నిత్యా నందుడితో, "రాజా! నువ్వు త్వరగా రథాన్ని వెనక్కు తిప్పుకుని వెళ్ళిపోవటం మంచిది. అదుగో, నీ సైనికులు మరొకసారి నిన్నొదిలి పారిపోయేందుకు సిద్ధంగా వున్నారు," అన్నాడు అవహేళన చేస్తున్నట్టు.

నిత్యానందుడు తన సైనికుల కేసి తిరిగి, "మన కొచ్చిన భయం ఏమీ లేదు.



ఈ మహావీరులైన యువకులు యిక్కడ వుండగా, ఆ రాకాసి ఏనుగు మనను ఏమీ చేయలేదు,'' అని చెప్పి, ఖడ్గ జీవదత్తులతో, ''మీ శౌర్యసాహసాలు అపూర్వమైనవి. విఘ్నేశ్వర పూజారి వాహనం అయిన ఆ రాకాసి ఏనుగును ఎలా అయినా సంహరించారంటే, మీరు నన్నూ, నా రాజ్య ప్రజలనూ రక్షించినట్టే,'' అన్నాడు.

''ఆ ఏనుగును చూసి అంత భయపడతారేం? ఒక్క కత్తిదెబ్బతో దాని తొండాన్నో, కాలునో నరికి దాన్ని నేల కూల్చవచ్చునే!'' అన్నాడు ఖడ్గవర్మ.

''శూరుడా! అది ఐరావతంజాతి ఏనుగు. దాని శరీరం మీదిది చర్మం కాదు, ఉక్కు కవచం. మనం దాని కేసి బాణం కొడితే, అది దాని శరీరాన్ని తాకుతూనే ఖంగుమంటూ శబ్దం చేసి, ఎగిరి అంత దూరాన పడుతుంది. ఆ రాకాసి ఏనుగును చంపేందుకు అన్ని రకాల ప్రయత్నాలూ చేసి విఫలులమైయ్యాకే అదంటే, నేనూ, నా సైనికులూ ఇంతగా భయపడుతున్నాము,'' అన్నాడు నిత్యానందుడు.

ఈ ఉక్కు కవచం అన్న మాట ఖడ్గవర్మకు చాలా ఆశ్చర్యం కలిగించింది. అతడు జీవదత్తుడితో, ''ఇది ఐరావతంజాతి ఏనుగా? దాని శరీరం మీద ఉక్కు కవచం ఉన్నదా? అలా అయితే పరీక్షించి చూద్దాం,'' అంటూ విల్లు పైకెత్తి ఏనుగు పొట్టకు తగిలేలా గురి చూసి బాణం వదిలాడు.

బాణం గురిగా పోయి ఏనుగు పొట్టను తాకింది. మరుక్షణం ఖంగుమంటూ పెద్ద శబ్దమైంది. ఖడ్గవర్మ విల్లు ఎత్తటం, బాణం వదలటం—అంతా జాగ్రత్తగా చూస్తున్న విఘ్నేశ్వరపూజారి, బాణం ఎగిరి దూరంగా పడగానే పెద్దగా నవ్వాడు.

''ఆ పూజారి ధైర్యం మెచ్చుకోదగింది. కాని అంతపెద్ద ఏనుగు ఏమిటి? దానికి ఉక్కు కవచం ఏమిటి? ఈ సంగతేదో తేల్చుకుని గాని, యిక్కణ్ణించి పోరాదు,'' అన్నాడు ఖడ్గవర్మ.

"అవును, ఖడ్గా! యిందులో ఏదో మోసం వుంది. పూజారి నెత్తిన కిరీటం ఏమిటి? వీడికి రాజుతో విరోధం ఎందుకు? గుడిపూజ మాని సింహాసనం ఎక్కి రాజ్యం పాలించా లనుకుంటున్నాడా? జాగ్రత్తగా పద, యీ ఏనుగు సంగతేమిటో తేలుద్దాం," అన్నాడు జీవదత్తుడు.

ఖడ్గజీవదత్తులు తమ వద్దకు అతి నెమ్మదిగా నడిచివస్తున్న రాకాసి ఏనుగు కేసి బయలుదేరారు. ఇది చూసిన నిత్యానంద రాజూ, అతడి సైనికులూ నివ్వెరపోయారు. వాళ్ళకు ఇది దుస్సాహసంగా కనిపించింది. రాకాసి ఏనుగు ఏ క్షణాన అయినా వాళ్ళిద్దర్నీ తొండంతో పట్టుకుని గుంజి, కాళ్ళతో మట్టగించి చంపవచ్చున్న భయం కలిగింది.

విఘ్నేశ్వర పూజారి మాత్రం రాకాసి ఏనుగు మీద తొణక్కుండా కూర్చుని దాని వెనకా, పక్కలనా వస్తున్న ఆటవికులకు ఏమో చెప్పి, ఖడ్గ జీవదత్తులతో, "మహాశూరులారా! రండి, రండి. మీరు నా భృత్యుల్ని చంపారన్న కోపం నా కేమీ లేదు. నా తపశ్శక్తితో వాళ్ళను కావాలంటే యీ నిమిషానే బతికించగలను. కాని, యీ అరణ్యంలో ఆటవిక జనానికి ఏమీ లోటు లేదు గనక, ఆ పని చేయను. మీరు నా పక్షం వహించి, ఆ మాటతప్పిన రాజును తుదముట్టించేందుకు సహాయపడతారా?



అలా చేశారంటే, మిమ్మల్ని ధనకనక వస్తు వాహనాలతో సత్కరించగలను!" అన్నాడు.

పూజారి మాటలు ఖడ్గ జీవదత్తులకు నవ్వు తెప్పించినై. వాళ్ళు రాకాసి ఏనుగుకు ఒక ఇరవై అడుగుల దూరంలో ఆగి, "పూజారీ! నువ్వు ఏనుగును అక్కడే ఆపు. మనం మాట్లాడవలసింది కొంత వున్నది." అన్నారు.

పూజారి ఏనుగు కుంభస్థలం మీద పిడికిటితో కొట్టాడు. ఏనుగు వున్న చోటునే నిలబడిపోయింది. జీవదత్తుడు ఏనుగు కేసి పరీక్షగా ఓసారి చూసి, "పూజారీ! రాజు మాట తప్పాడన్నావు, ఏమిటది?" అని అడిగాడు.

విఘ్నేశ్వర పూజారి, ఖడ్గ జీవదత్తులకు తాను విఘ్నేశ్వరాలయంలో కన్న కల గురించీ, ఆ తరవాత రాజు తనను సభలో అవమానించి, దేశ బహిష్కారం చేసిన సంగతీ తెప్పి, "ఇప్పుడు నేను అధిరోహించి వున్న ఈ ఏనుగు, ఇంద్రుడి వాహనమైన ఐరావతానికి చాలా దగ్గిర బంధువు. దీని వయసు వెయ్యేళ్ళ పైనే వుంటుంది. దీని సాయంతో ఆనందపురాన్ని జయించబోతున్నాను. మీరు అనవసరంగా రాజు నిత్యానందుడికి సాయం చేయబోయి చిక్కుల్లో పడకండి. ఇష్టమైతే నా పక్షానికి రండి. కోరినంత ధనం ఇస్తాను," అన్నాడు.

పూజారి మాటలు ఖడ్గజీవదత్తులకు ఆశ్చర్యంతో పాటు, అనుమానం కూడా కలిగించినై. ఖడ్గవర్మ, రాకాసి ఏనుగు కేసి నడుస్తూ, "ఇది ఐరావతం జాతిదా? వెయ్యేళ్ళ వయసా? నడకతీరు చూస్తుంటే, ఇంకా తల్లిపాలు వదిలినట్టే లేదు!' 'అన్నాడు.

ఖడ్గవర్మ వెంట జీవదత్తుడు కూడా ఏనుగు దగ్గిరకు పోయాడు. వాళ్ళు దాని తొండం పట్టుకుని పరీక్షగా చూడసాగారు. ఆ సమయంలో విఘ్నేశ్వర పూజారి రాకాసి ఏనుగు కుంభస్థలం మీద పిడికిటితో గట్టిగా పొడిచాడు. మరుక్షణంలో ఏనుగు తొండాన్ని గిరున తిప్పి, ఖడ్గ జీవదత్తుల శరీరాలను మెలివేసింది. అదే నిమిషంలో ఆటవికులు గుంపుగా వచ్చి వాళ్ళను వడిసి పట్టుకున్నారు.

ఖడ్గ జీవదత్తులకు కాలూచేయీ కదిపేందుకూడా అవకాశం లేకపోయింది. విఘ్నేశ్వర పూజారి అది చూసి పెద్దగా నవ్వుతూ, "ఈ ఇద్దర్నీ నేను గుహాలయానికి తీసుకుపోతాను. మీరు రాజు నిత్యానందుణ్ణి పట్టి కట్టి తీసుకురండి!" అని ఆటవికులను ఆజ్ఞాపించాడు.

ఆటవికులు పెడబొబ్బలు పెడుతూ, చెట్ల కింద వుండి యిదంతా చూస్తున్న రాజు నిత్యానందుడి కేసి పరిగెత్తారు. సారథి రథాన్ని వెనక్కు తిప్పాడు. నిత్యానందుడు తన సైనికులను, ఆటవికుల్ని ఎదుర్కొమని ఆజ్ఞాపించాడు. —(ఇంకావుంది)



# నేరస్థుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, ''రాజా, నువు ఏ నేరమూ చేయకుండానే శిక్ష అనుభవిస్తున్నవాడి లాగా కనబడుతున్నావు. కాని నేరం చేసి శిక్ష తప్పించుకున్న ఒక యువకుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒక బాటసారి చాలా దూరప్రయాణం చేసి రాత్రి చాలా పొద్దుపోయి కాంచన నగరాన్ని చేరుకున్నాడు. నగరానికి కొత్తవాడు కావటం చేత ఆ రాత్రికి ఎక్కడ పడుకోవాలో తెలియక, ఒక విశాలమైన వీధిలో ఒక ఇంటి వసారాలో అరుగు మీద పడుకుని, అలసట చేత వెంటనే నిద్రపోయాడు.

## బేతాళ కథలు

కొంతసేపటికి మాటల సవ్వడికి ఆ బాటసారికి నిద్రాభంగం కలిగింది. ఇద్దరు మనుషులు చిన్నగొంతుతో మాట్లాడటం వినిపించి, అయన వారి సంభాషణ ఆలకించసాగాడు. ఆ మాట్లాతున్నవారిలో ఒకడు యువకుడూ, ఒకడు రక్షకభటుడూ అని బాటసారి గ్రహించాడు.

"అబ్బాయీ, దొంగతనం పెద్ద నేరమూ, మహా పాపమూ గదా, ఇంత చిన్న వయసులో నువు ఎందుకీ పని చేశావు? రాజదండనకూ, నరకానికీ కూడా నిన్ను నువు గురి చేసుకున్నావే!" అన్నాడు రక్షకభటుడు.

దాని కా యువకుడు, "అయ్యా, మీ రన్నది నిజమే. కాని పరిస్థితి గొంతు మీదికి వచ్చి, నే నీ పాడుపని చేశాను. ఈసారికి నన్ను వదిలేశారంటే, జన్మలో ఎన్నడూ దొంగతనం చెయ్యను," అన్నాడు.

"నీ గొంతు మీదికి వచ్చిన పరిస్థితి ఏమిటి?" అని రక్షకభటుడు అడిగాడు.

యువకుడు తన విషాద గాథ ఇలా చెప్పాడు:

ఆ యువకుడిది చాలా పేద కుటుంబం. అతని తండ్రి చిన్నతనంలోనే పోతే, అతని తల్లి ధనవంతుల ఇళ్ళలో పని చేసి తన కొడుకును సాకింది. కొద్ది డబ్బు పోగు కాగానే ఆమె పూటకూళ్ళ ఇల్లు నడిపి, బాటసారులకు తిండి పెట్టుతూ వా రిచ్చే డబ్బుతో ఇల్లు గడుపుతూ, కొడుకును చదివించసాగింది.



ఇలా ఉండగా, ఒకనాడు చీకటిపడి భార్యాభర్త లిద్దరు వారింటికి వచ్చారు. వాళ్ళకు స్నానపానాలు అమర్చి, యువకుడి తల్లి వారి కోసం ప్రత్యేకంగా వంటచేసింది. ఆ భార్యాభర్తలు భోజనం చేసి ఆ రాత్రికి ఆ ఇంటనే పడుకున్నారు.

అలా పడుకున్నవారు, మర్నాడు తెల్లవారి చూసేసరికి, చనిపోయి ఉన్నారు. వైద్యులు వచ్చి చూసి, వాళ్ళు విషప్రయోగంతో మరణించినట్టు తేల్చారు. కిందటి రాత్రి వారు తినగా మిగిలిన అహారపదార్థాలు పరీక్షిస్తే, అందులో చచ్చిన బల్లి ఒకటి కనిపించింది.

తప్పు పూటకూళ్ళ మనిషిదే గాని, ఆమె బుద్ధిపూర్వకంగా ఆ పని చెయ్యలేదు. అది ఆమెకు తెలియకుండా జరిగిపోయిన ప్రమాదం.

అయినా ఈ వార్త రాజుగారి దాకా వెళ్ళింది. రాజు ఆమెను తన న్యాయస్థానానికి రప్పించి, విచారణ జరిపాడు. ఆయన ఆమెకు మరణదండన విధించాడు. రాజసభలో కొందరు అంత తీవ్రమైన శిక్షకు అభ్యంతరం చెప్పారు; కావాలని చేసిన హత్యకూ, ప్రమాదవశాన జరిగిన హత్యకూ ఒకే శిక్ష విధించటం భావ్యం కాదన్నారు.

రాజు కరుణించి, నెల రోజులలోగా పదివేల వరహాలు జరిమానా కట్టినట్టయితే ఆమెను విడిచిపెట్టుతాననీ, లేని పక్షంలో గడువు తీరగానే ఆమెకు మరణశిక్ష తప్పదనీ తీర్పు చెప్పాడు.





యువకుడికి అంత మొత్తం ఎలా సంపాదించాలో తోచలేదు. అతను కొన్నాళ్ళు కట్టెలు కొట్టి తెచ్చి అమ్మాడు; తన తల్లిని బతికించుకోవటం కోసం పడరాని పాట్లన్నీ పడ్డాడు. ఈ రోజుతో నెల రోజుల గడువు తీరిపోయింది. రేపు అతని తల్లిని ఉరి తీస్తారు. ఈ నెలరోజులూ అతను అష్ట కష్టాలూ పడి సంపాదించినది నూరు వరహాలు మాత్రమే. ఆ పరిస్థితిలో ఆ యువకుడు దొంగతనం చేసి, ఆ అర్ధరాత్రి వేళ రక్షకభటుడికి దొరికిపోయాడు.

ఆ యువకుడి కథ వింటున్న బాటసారికి గుండె కరిగిపోయింది. రక్షకభటుడి మనసు కూడా మెత్తబడినట్టున్నది. అతను యువకుడితో, "బాబూ, నీకు వచ్చిన కష్టం భయంకరమైనదే. కాని నువు దొంగతనం చెయ్యటం చాలా పెద్ద పొరపాటు. ఎక్కడన్నా అప్పు పుట్టించలేక పోయావా?" అన్నాడు.

"అయ్యా, మీరే చెప్పండి, నాకు పది వేల వరహాలు ఎవరు అప్పు పెడతారు? ఆ అప్పు ఎలా తీర్చగలను?" అన్నాడు యువకుడు.

"పోనీ డబ్బుగల స్త్రీని చూసి పెళ్ళాడ లేకపోయావా?" అని రక్షకభటు మళ్ళీ అడిగాడు.

"డబ్బుగల స్త్రీ మాట దేవు డెరుగు, నాకు పేదపిల్లను మాత్రం ఎవ రిస్తారు?" అన్నాడు యువకుడు దీనంగా.

రాజభటుడు కొంచెం ఆలోచించి, "జరిగిన దేదో జరిగింది. మరెన్నడూ ఇలాటి పని చెయ్యకు. నేనూ బీదవాణ్ణే. నాకూ ఎన్నో కష్టా లున్నాయి. నువు దొంగిలించిన దాంటో నీ అవసరానికి తగినంత ఉంచుకుని, మిగిలినది నా కిచ్చి, నీ దారిన నువు వెళ్ళు," అన్నాడు.

ఈ మాటలు వినగానే బాటసారికి పట్టరాని కోపం వచ్చింది. రక్షకభటుడైనవాడు నేరస్థుణ్ణి వదిలిపెట్టడమే గాక, అలా చేసినందుకు దొంగసొమ్ములో భాగం పుచ్చుకోవటం ఎంత గొప్ప నేరం?

మర్నాడు ఈ బాటసారి రాజసభకు వెళ్ళాడు గాని, రక్షకభటుడు చేసిన నేరాన్ని గురించి ఆయన ఎవరికీ చెప్పనేలేదు. యువకుడు రాజుగారికి జరిమానా చెల్లించి తన తల్లిని విడిపించుకున్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ఎవరి నేరం గొప్పది? వల్లమాలిన జరిమానా విధించిన రాజుదా? దొంగతనం చేసిన యువకుడిదా? వాడి దగ్గర లంచం పుచ్చుకుని, దొరికిన దొంగను విడిచిపుచ్చిన రక్షకభటుడిదా? యువకుడి నేరమూ, రక్షకభటుడి నేరమూ ప్రత్యక్షంగా చూసి కూడా వాటిని గురించి ఎవరికీ చెప్పని బాటసారిదా? ఆ బాటసారి యువకుడి పరిస్థితికి జాలి పడ్డాడే అనుకున్నా, కనీసం రక్షకభటుడి నేరాన్ని ఎందుకు వెల్లడి చెయ్యలేదు? ఈ అనుమానాలకు సమాధానాలు తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "బాటసారి రక్షకభటుడి చర్యను చూసి మండిపడ్డాడే గాని, అతన్ని బయట పెడితే యువకుడి దొంగతనం కూడా బయటపడుతుంది. అందువల్ల కలిగే పర్యవసానం ఏమంటే యువకుడి తల్లికి ఉరిశిక్ష తప్పనిసరిగా పడుతుంది. అందుచేత అతను రక్షకభటుడి నేరాన్ని, యువకుడి కోసమూ, అతని తల్లి ప్రాణరక్షణ కోసమూ, దాయవలసి వచ్చింది. రక్షకభటుడైనా నేరస్థుల పట్ల అశ్రద్ధగా ప్రవర్తించేవాడు కాడు. దొంగతనం నేరమే కాక, మహా పాపమని అతని నమ్మకం. యువకుడి కథ విని అతని నేరాన్ని క్షమించ దలుచుకుని రక్షకభటుడు ఆ యువకుడి పాపంలో నైనా భాగం పంచుకుందామని అనుకుని ఉండవచ్చు. అన్నం అమ్ముకుని బతికే ఒక అనాథ ప్రాణానికి పదివేల వరహాల విలువ కట్టిన రాజు అందరి కన్నా పెద్ద నేరస్థుడు. అలాంటివాడి పాలనలో ధర్మం నూటిగా నడవదు," అన్నాడు.

రాజుకి ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



Telugu Nov. F—4 B P. 22

# అంగరక్షకుడు



ఒక రాజుగారి అంగరక్షకుడి పదవి ఖాళీ అయింది. ఆ పని చేస్తామని చాలామంది వచ్చారు. ధైర్యసాహసాలలో ఉత్తములుగా రుజువైన వాళ్ళు ఇద్దరు కనిపించారు. మంత్రి వారిలో ఒకణ్ణి రాజుగారి అంగరక్షకుడుగా నియమించవలసి ఉన్నది.

మంత్రి ఒకణ్ణి ఇలా అడిగాడు: "రాజుగారిని శత్రువులు ఎత్తుకుపోతే ఏం చేస్తావు?"

"శత్రువుల మీద యుద్ధం ప్రకటించి, జయించి, రాజుగారిని తిరిగి తెస్తాను," అన్నాడు వాడు.

మంత్రి రెండోవాణ్ణి కూడా అదే ప్రశ్న వేశాడు.

"నేను రాజుగారి అంగరక్షకుడినై ఉండగా, నన్ను చంపకుండా శత్రువులు రాజుగారిని ఎలా తీసుకుపోగలరు?" అన్నాడు వాడు.

మంత్రి రెండోవాణ్ణి రాజుగారి అంగరక్షకుడుగా నియమించాడు. —మునీర్





# విద్యాసాగరుడు

ఒకప్పుడు పాటలీపుత్రంలో విద్యాసాగ రుడు అనే బ్రాహ్మణ యువకుడు ఉండే వాడు. అతను చిన్నతనంలోనే వేదశాస్త్రా లన్నీ అధ్యయనం చేసి, గొప్ప పండితు డనిపించుకున్నాడు. కాని అతని విద్యా దాహం తీరలేదు. ఇంకా నేర్చుకోవలసినది ఉన్నదనీ, దాన్ని నేర్చుకు తీరాలనీ అతను నిశ్చయించుకున్నాడు.

ఈ నిశ్చయంతో విద్యాసాగరుడు దేశా టన చేస్తూ, ఎందరో పండితులను కలుసు కుని మాట్లాడాడు. కాని అతనికి తృప్తి కలగ లేదు. ఎందుకంటే, వారెవరూ తన కన్న తెలిసిన వారు కారు. అందుచేత అతను తన పర్యటన కొనసాగించి, ఒక పెద్ద పర్వ తంలోని లోయను చేరుకున్నాడు. అది చాలా అందమైన లోయ. ప్రయాణపు బడలికతో విద్యాసాగరుడు ఒక పెద్ద రావిచెట్టు కింద నడుము వాల్చి నిద్రపోయాడు.

అదే చెట్టు మీద ఒక బ్రహ్మరాక్షసుడు ఉంటున్నాడు. చెట్టు కింద ఎవరో బ్రాహ్మణ యువకుడు నిద్రపోతూ ఉండటం గమ నించి, ఆ బ్రహ్మరాక్షసుడు చెట్టు దిగి వచ్చి, ఆ యువకుణ్ణి లేపాడు.

విద్యాసాగరుడు నిద్ర లేచి, తన ఎదట ప్రత్యక్షమైన బ్రహ్మాండమైన ఆకారాన్ని చూసి, "అయ్యా, మీ రెవరో నాకు తెలి యదు. నేను పాటలీపుత్ర పురవాసిని. నా పేరు విద్యాసాగరుడు. నేను వేదశాస్త్రాలు అధ్యయనం చేసి, విద్యాభిలాష తీరక, గురువుల కోసం దేశ సంచారం చేస్తున్నాను," అని చెప్పాడు.

ఈ మాటకు బ్రహ్మరాక్షసుడు సంతో షించి, "నాయనా, నీ వంటి విద్యాభిలాష అందరికీ ఉండదు. నేర్చుకోవలసినది ఎంతైనా ఉన్నది. ఆరునెలల పాటు నా వద్ద ఉన్నట్టయితే నేను నీకు కావలసిన విద్య

ఎస్. రమణయ్య

అంతా నేర్పుతాను. తరవాత నీ దారిన నువు పోవచ్చు." అన్నాడు.

ఇందుకు విద్యాసాగరుడు సంతోషంగా ఒప్పుకున్నాడు.

బ్రహ్మరాక్షసుడు చెట్టెక్కి, తాను మామూలుగా కూర్చునే కొమ్మ మీద కూర్చున్నాడు. విద్యాసాగరుడు దాని కింద ఉన్న కొమ్మ మీదికి ఎక్కి కూర్చున్నాడు. విద్యాసాగరుడు ఆరునెలల పాటు బ్రహ్మరాక్షసుడి వద్ద తనకు తెలియని శాస్త్రాలూ, మంత్ర విద్యలూ నేర్చుకుని, వాటిని రావి ఆకులపై రాసుకున్నాడు.

ఆరునెలల గడువు పూర్తి కాగానే బ్రహ్మరాక్షసుడు విద్యాసాగరుడితో, "నాయనా, నీకు విద్య చెప్పి నేను శాపవిముక్తి పొందాను. ఇక నేను పుణ్యలోకాలకు పోతాను. నువు నీ దేశం తిరిగి పోయి, శాస్త్రోక్తంగా పెళ్ళాడి, ప్రఖ్యాతి గల కొడుకులను కని, సుఖంగా జీవించు," అని చెప్పి, అంతర్ధానమయాడు.

విద్యాసాగరుడు తాను రాసిన ఆకులన్నీ కట్టగా కట్టుకుని చంకన పెట్టుకుని, తన దేశానికి ప్రయాణమయాడు. అతను కళింగ దేశం చేరి, ఆకలి దప్పులతో శోష వచ్చి, ఒక ఇంటి ముందున్న అరుగు మీద పడుకుని స్పృహ తప్పిపోయాడు.

ఆ ఇల్లు మందాకిని అనే శూద్ర స్త్రీది. ఆమె రాత్రి పొద్దుపోయి ఇంటికి తిరిగి వచ్చి, తన అరుగు మీద నిద్రపోతున్నట్టున్న యువకుణ్ణి చూసి, నిద్ర లేపటానికి



ప్రయత్నించింది. కాని విద్యాసాగరుడు శోషతో స్పృహ తప్పి ఉండటం చేత అతన్ని లేపటం ఆమెకు సాధ్యం కాలేదు.

ఆమె అతన్ని తన ఇంట్లోకి చేర్చి, వైద్యుణ్ణి పిలిచి పరీక్ష చేయించింది. విద్యాసాగరుడు తిండి సరిగా లేక దీర్ఘ ప్రయాణాలు చేసి చాలా నీరసించి ఉన్నాడు. వైద్యుడి సహాయంతోనూ, మందాకిని ఉపచారాలతోనూ విద్యాసాగరుడు కోలుకోవటానికి నెల రోజులు పట్టింది.

అతను పూర్ణారోగ్యం పొంది మళ్ళీ ప్రయాణం అవుతూ, "నేను ఇంటి నుంచి బయలుదేరి చాలా కాలమయింది. నీ సహాయం మరవరానిది. దానికి తగిన ప్రతిఫలం నీకు ముట్టకపోదు," అన్నాడు.

"నాకు ప్రతిఫలం ముట్టేటట్టు చెయ్యటం నీ చేతిలోనే ఉన్నది. నన్ను ఎందరో యువకులు పెళ్ళాడగోరారు. ఇప్పుడు కూడా అనేకమంది నన్ను పెళ్ళాడటానికి సిద్ధంగా ఉన్నారు. కాని నేను ఎవరినీ వరించలేదు. నిన్ను చూడగానే నీకు భార్య కావాలని నాకు కోరిక కలిగింది. అందుచేత నా కోరిక తీర్చి నన్ను పెళ్లాడు," అని మందాకిని విద్యాసాగరుడితో అన్నది.

దానికి విద్యాసాగరుడు, "నేను బ్రాహ్మణ బ్రహ్మచారిని. నువు శూద్ర స్త్రీవి. నేను నిన్ను పెళ్ళాడటానికి ధర్మశాస్త్రం ఒప్పదు. నేను నిన్ను పెళ్ళాడదలిస్తే ముందుగా ఒక బ్రాహ్మణస్త్రీనీ, క్షత్రియస్త్రీనీ, వైశ్యస్త్రీనీ పెళ్ళాడి అనంతరం నిన్ను పెళ్ళాడాలి.



ఇది ధర్మం. దాన్ని ఉల్లంఘించలేను. నన్ను ఏం చెయ్యమంటావో నువే చెప్పు," అన్నాడు.

"అన్ని సమస్యలూ తీర్చటమూ, ధర్మాన్ని రక్షించటమూ రాజుగారి విధి. నేను నా సమస్యను రాజుగారికి నివేదిస్తాను," అన్నది మందాకిని.

ఆమె రాజుగారి వద్దకు వెళ్ళి తన పెళ్ళి సమస్యను ఆయనకు వివరంగా చెప్పింది. రాజు సభ చేసి, విద్యాసాగరుణ్ణి పిలిపించాడు. విద్యాసాగరుడి పాండిత్యమూ, ప్రవర్తనా, మాట తీరూ రాజుకు నచ్చాయి.

"విద్యాసాగరుడు బుద్ధిమంతుడు. పరిస్థితులు గమనించినట్టయితే, మందాకిని అతనికి భార్య కావాలని కోరటం సముచితంగానే ఉన్నది. విద్యాసాగరుడు ఆమె కోరిక తీర్చటానికి సిద్ధంగానే ఉన్నాడు. అయితే అందుకు అడ్డంకి ఏమిటంటే అతను మందాకినితోబాటు మిగిలిన మూడు కులాల కన్యలనూ పెళ్ళాడాలి. అందుకు నేనొక ఉపాయం చెబుతాను. మన మంత్రి సత్ముడికీ, నాకూ, వైశ్య కులపతికీ వివాహం కావలసిన కుమార్తెలున్నారు. మందాకినితోబాటు ఈ ముగ్గురు కన్యలనూ విద్యాసాగరుడు పెళ్ళాడితే ధర్మహాని జరగదు," అని రాజు అన్నాడు.

ఈ నిర్ణయాన్ని సభవారందరూ ఆమోదించారు. వెంటనే వివాహ ప్రయత్నాలు ప్రారంభమయాయి.

ఒక మంచి ముహూర్తంలో విద్యాసాగరుడు నాలుగు వర్ణాల స్త్రీలనూ పెళ్ళాడాడు. అతను పెళ్ళాడిన బ్రాహ్మణ కన్య పేరు మాలతి, క్షత్రియ కన్య పేరు కళావతి, వైశ్య కన్య పేరు సుమంగళ. మందాకిని అతని శూద్ర భార్య.

ఈ నలుగురు భార్యలతోనూ విద్యాసాగరుడు సుఖంగా సంసారం చేస్తూ, నలుగురు కొడుకులను కన్నాడు. బ్రాహ్మణ భార్యకు వరరుచీ, క్షత్రియ భార్యకు విక్రమాదిత్యుడూ, వైశ్య భార్యకు భట్టీ, శూద్ర భార్యకు భర్తృహరీ కలిగారు. వీరు నలుగురూ అఖండ ఖ్యాతి సంపాదించినవారే.





# సజ్జనుడి పాట్లు

## 3

అత్తఫ్ పడటం చూసి మరొక కొజ్జావాడు దూరంనుంచి పరిగెత్తుకుంటూ వచ్చి, అతన్ని లేవదీసి, ముఖం మీద నెత్తురు తుడిచి, అతని బట్టలకు అంటిన దుమ్ము దులిపి, "అన్నా, నీ కేం కావాలి?" అని అడిగాడు.

"ఈ కాగితాన్ని జఫర్‌కు అందించాలి. అంతే నేను కోరేది," అన్నాడు అత్తఫ్.

ఆ రెండో కొజ్జావాడు ఉత్తరం తీసుకొని లోపలికి వెళ్ళేసరికి జఫర్ పెద్ద అధికారుల మధ్య తాగుతూ, మాట్లాడుతూ, సంగీతం వింటూ ఉన్నాడు. అతను నిలబడి ఉన్నాడు. అతని చేతిలో సారాగ్లాసు ఉన్నది. అతను ఆ సమయానికి అత్తఫ్ గురించే మాట్లాడు తున్నాడు.

అది చూసి మరింత ఆనందంతో కొజ్జా వాడు వంగి, జఫర్‌కు ఉత్తరం అందించాడు. జఫర్ ఆ ఉత్తరం చదివి భరించరాని ఆనందోద్రేకంలో స్పృహతప్పి, నిలువునా చాపచుట్టలాగా ముందుకు పడిపోయాడు. ఆయన చేతిలో ఉన్న గ్లాసు వెయ్యి ముక్కలయింది. అందులో ఒక ముక్క జఫర్ నుదుట దిగబడింది. ఆ గాయం నుంచి రక్తం ప్రవహించింది.

కొజ్జావాడు అది చూసి కంగారుపడి పారిపోయాడు. జఫర్‌ను ఆయన మిత్రులు లేవదీసి, రక్తం తుడిచి, "ఈ పనివెధవలు ఎప్పుడూ ఇంతే. ఈ కాగితం పంపిన వాణ్ణి నగరరక్షకుడి (వలీ) వద్దకు పంపి, అయిదు వందల బెత్తం దెబ్బలు కొట్టించి, ఖైదులో వేయించాలి," అన్నారు.

ఉత్తరం రాసినవాడి కోసం బానిస నౌకర్లు బయటికి పరిగెత్తారు. వాళ్ళకు ఏమీ శ్రమ లేకుండా, "ఆ ఉత్తరం రాసినవాణ్ణి నేనే!"

అరేబియా జానపద కథ



అని అత్తఫ్ వారితో అన్నాడు. వాళ్ళు అతన్ని వలీ వద్దకు తీసుకుపోయి, అయిదువందల దెబ్బలు కొట్టించి, ఖైదులో పెట్టించారు. అతనికి వేసిన సంకెళ్ళ మీద "యావజ్జీవం" అని రాసి ఉన్నది.

జఫర్ స్పృహతెలియగానే, "నాకు చీటీ పంపినవాడు ఏ మయ్యాడు?", అని తన నౌకర్లను అడిగాడు. ఆ మనిషికి యావజ్జీవ కారాగార శిక్ష పడ్డట్టు తెలిసింది.

"అతన్ని వెంటనే నా దగ్గిరికి తీసుకు రండి," అని జఫర్ ఆజ్ఞాపించాడు.

అత్తఫ్ వచ్చి తనముందు నిలబడ్డప్పుడు జఫర్ అతన్ని పోల్చుకోలేక పోయాడు. కష్టాలు అతన్ని అంతగా మార్చేశాయి.

"మీ దేవూరు, నాయనా?" అని జఫర్ అడిగాడు.

"డమాస్కస్," అన్నాడు అత్తఫ్.

"నగరమా? పరిసరాలా?" అని జఫర్ మళ్ళీ అడిగాడు.

"నగరమే," అన్నాడు అత్తఫ్.

"అత్తఫ్ పేరు ఎప్పుడన్నా విన్నావా? అతను దాతృత్వానికి పేరు మోసినవాడు," అన్నాడు జఫర్.

"ఫలానా వీధిలో ఉన్న ఇంట మీకూ, అతనికీ స్నేహం ఉండటం ఎరుగుదును; మీ రిద్దరూ తోటలలో షికార్లు చెయ్యటం ఎరుగుదును; మీరు అతని ప్రేయసిని పెళ్ళాడటం ఎరుగుదును; మీరు బాగ్దాదుకు తిరిగి వచ్చేటప్పుడు దారిలో అతను వీడ్కోలు చెబుతూ మీరు తాగిన పాత్ర నుంచే అతనూ తాగటం ఎరుగుదును," అన్నాడు అత్తఫ్.

"ఇవన్నీ జరిగినవే. కాని నాకు వీడ్కోలు చెప్పాక అతను ఏమయాడు?" అని జఫర్ అడిగాడు.

"బాబుగారూ, అతన్ని విధి వేటాడింది," అంటూ అత్తఫ్ తన కష్టాలన్నీ చెప్పి, "జఫర్‌గారూ, నేనే అత్తఫ్‌ను!" అని ముగించాడు.

ఈ మాట వింటూనే జఫర్ పెద్దగా కేక పెట్టి అత్తఫ్‌ను కౌగలించుకున్నాడు. ఇద్దరూ

కొంతసేపు ఆనందంలో ప్రపంచాన్నే మరిచారు. తరవాత కూడా వారిద్దరికీ ప్రశ్నలు వేసుకోవటంలోనే చాలా కాలం గడిచిపోయింది.

తరవాత జఫర్ అత్తఫ్‌ను చెయ్యి పట్టుకుని స్నానశాలకు తీసుకుపోయాడు. అక్కడ స్నానం చేసి, విశ్రమించిన తరవాత అత్తఫ్ జఫర్ వెంట ఖలీఫా వద్దకు వెళ్లాడు.

"ప్రభూ, ఇతనే ఉదారుడైన అత్తఫ్. డమాస్కస్‌లో నేను ఇతనికే అతిథిగా ఉన్నాను. ఇతను నన్ను తన ప్రాణం కన్న ఎక్కువగా చూసుకున్నాడు," అంటూ జఫర్ అత్తఫ్‌ను ఖలీఫాకు పరిచయం చేశాడు.

చిక్కి, శల్యమై ఉన్న ఆ యువకుణ్ణి చూసి, నిట్టూర్పుతూ, "ఇంత హీనస్థితికి ఎలా వచ్చావు, నాయనా?" అని అడిగాడు ఖలీఫా.

అత్తఫ్ ఏడుస్తూ తన కష్టాలన్నీ ఖలీఫాకు చెప్పుకున్నాడు. అది విన్న మీదట ఖలీఫా, జఫర్లు ఏడ్చారు.

అత్తఫ్ కథ పూర్తి అయినాక ఖలీఫా జఫర్ కేసి తిరిగి, "ఇతనికి నువు ఎంతెంత రుణపడి ఉన్నావో జాబితా ఇయ్యి." అన్నాడు.

"మొదటి సంగతి నన్ను నేనే అతనికి రుణపడి ఉన్నాను; అతని బానిసను. అతని



వద్ద రొఖంగా పుచ్చుకున్నవి మూడు లక్షల దీనారాలు. బహుమానాల రూపంలో తీసుకున్నవి ఇంకా కొన్ని లక్షలుంటాయి. నేనా రుణాలన్నీ తీర్చేదాకా అతను ఇక్కడే ఉండి మనకు ఆనందం చేకూర్చాలి. పోతే, అతని భార్య నగరంలోనే ఉన్నది. ఆ విషయం ప్రత్యేకంగా ఆయనతో మాట్లాడాలి," అన్నాడు జఫర్.

వారిద్దరూ మాట్లాడుకునే విషయంలో తనకు ప్రమేయం లేదని గ్రహించి, వారిద్దరికీ సెలవు ఇచ్చి పంపేశాడు ఖలీఫా.

అత్తఫ్‌ను తన ఇంటికి తీసుకు పోతూ జఫర్, "తమ్ముడూ, నీకు ప్రాణసమానురాలైన భార్యను నేను తాకలేదు. ఆమెను

పెళ్ళాడాక ఆమె ముఖం కూడా నేను చూసి ఎరగను. నే నామెకు ఏనాడో విడాకులు ఇచ్చేశాను. ఆమెను తిరిగి నువు స్వీక రించు," అన్నాడు.

ఆ విధంగా అత్తఫ్ తన భార్యను తిరిగి కలుసుకున్నాడు.

ఖలీఫా ఉత్తరువులు డమాస్కస్ చేర గానే అక్కడి పాలకుణ్ణి గొలుసులతో బంధించి, చీకటి కొట్టులోకి తోశారు.

తన భార్యతోనూ, జఫర్ స్నేహంతోనూ, ఖలీఫా పరిచయంతోనూ అత్తఫ్ బాగ్దాదులో చాలా మాసాలు సుఖంగా గడిపాడు. అతను యావజ్జీవమూ అక్కడే ఉండి పోయేవాడే గాని, వెంటనే బయలుదేరి రమ్మంటూ డమాస్కసు నుంచి అతని మిత్రులూ, బంధువులూ మళ్ళీ మళ్ళీ ఉత్తరాలు రాశారు. అతను వెళ్ళి పోవటం ఖలీఫాకు కూడా ఇష్టం లేదు. అతను డమాస్కస్ నగర రక్షకుడు (వలీ)గా ఉద్యోగం చెయ్య టానికి సమ్మతించిన మీదట, ఖలీఫా అతని వెంట పెద్ద పరివారాన్నీ, అనేక ఒంటె లనూ, కంచర గాడిదలనూ, అతనికి అంతు లేని కానుకలనూ ఇచ్చి తిరిగి వెళ్ళ నిచ్చాడు.

అతను చేరేసరికి అతని గౌరవార్థం డమాస్కస్ నగరమంతా దీపాలతోనూ, ఇతర అలంకరణలతోనూ వెలిగి పోతున్నది. అత నంటే ఎంతో అభిమానించిన పేదప్రజలు, అతను వెళ్ళిపోయినప్పుడు ఎలా ఏడ్చారో, ఇప్పుడు అంతగా ఆనందించారు.

ఖలీఫా నగరపాలకుడికి మరణదండన విధించాడు గాని, అత్తఫ్ జోక్యం కలిగించు కుని, ఆ శిక్షను యావజ్జీవ కారాగార శిక్షగా మార్పించాడు.

ఖలీఫా ఒకరాత్రి చదువుతూ నవ్వి, ఏడ్చిన పాతపుస్తకం మాట ఏమిటి? ఖలీఫా దానిమాట అప్పుడే మరిచాడు. జఫర్ తిరిగి వచ్చాడన్న ఆనందంలో ఖలీఫాకు జరిగిన దంతా తుడిచి పెట్టుకుపోయింది. జఫర్ తానై పొరపాటున కూడా ఆ పుస్తకం మాట ఖలీఫా దగ్గిర ఎత్తలేదు. దానితో మనకు మాత్రం ఏం పని? —(అయిపోయింది)





# పరివర్తన

మణిపుర రాజ్యాన్ని ఒక వృద్ధ రాజు ఏలుతూ ఉండేవాడు. ఆయన వంశానికి ఆయన మనమరాలు మందారవల్లి అనే ఆమె ఒక్కతే ఉన్నది. తాత బతికి ఉండ గానే ఆమెకు రాజ్యాభిషేకం జరిగింది.

తాత ఆమెతో, "అమ్మా, నువు పెళ్ళి చేసుకుని సంతానాన్ని కను. లేకపోతే నీతోనే మన వంశం అంతరించి పోతుంది," అన్నాడు.

మందారవల్లికి పెళ్ళి చేసుకోవటం ఇష్టం లేదు. ఒక పురుషుడు తనకు భర్త అయి, తన పైన అధికారం చెలాయించటం ఆమెకు సహించరానిదిగా ఉండేది.

"వంశం నిలబెట్టటానికే అయితే ఎవరిని పెళ్ళాడినా ఒకటే," అని తాతకు చెప్పి, మందారవల్లి తమ కొలువులో ఉన్న ఒక అనామకుణ్ణి పెళ్ళాడింది. అతను పేరుకు రాణిగారి భర్తగాని, అతనికి ఏ పదవీ లేదు. అతను వేళకు తిని, మిగిలిన కాలంలో కోటలో ఎక్కడోపడి ఉండేవాడు. అతన్ని గురించి ఎవరూ పట్టించుకునేవారు కారు. రాణి ఎప్పుడూ రాచకార్యాలలో మునిగి ఉండి భర్తను గురించి ఎప్పుడోగాని ఆలో చించేది కాదు.

మందారవల్లి కొంత కాలానికి ఒక ఆడ పిల్లను కన్నది. ఆమెకు మందారమాల అని పేరు పెట్టుకున్నారు. కుమార్తె పుట్టినాక మందారవల్లి తన భర్తను గురించి బొత్తిగా పట్టించుకోవటం మానేసింది. కాని మందార మాల మాత్రం తన తండ్రి దగ్గిర వీలయి నంతకాలం గడుపుతూ, అతనంటే ప్రేమగా ఉండేది.

మందారమాల పుట్టిన కొంత కాలానికి మందారవల్లి తాత చనిపోయాడు. చనిపోయే ముందు ఆయన మందారవల్లిని పిలిచి, "నీ కూతురు పెద్దకాగానే ఆమెకు పెళ్ళి

చేసెయ్యి. దాని కడుపున అయినా వారసుడు కలగవచ్చు," అన్నాడు.

మందారమాలకు పెళ్ళియీడు వచ్చింది. చుట్టుపక్కల ఉన్న దేశాల రాజకుమారులు ఆమెను పెళ్ళాడటానికి సిద్ధంగా ఉన్నారు. వారిలో కొందరు మందారవల్లి దగ్గిరికి పెళ్లి రాయబారాలు కూడా పంపారు. అయితే మందారవల్లి ఆ రాయబారులను అవమానించి పంపింది. తనలాగే తన కుమార్తె కూడా అనామకుడైన భర్తను పెళ్ళాడి, ఆమెకు దాసుడై పడిఉండాలని!

ఈ సంగతి తెలిసి మధురాపురపు యువరాజు మకరందుడు అతి సామాన్యుడిలాగా వేషం వేసుకుని మణిపురనగరానికి వచ్చి, రాజభవనం వద్ద ఉన్న ద్వారపాలకులతో, "నాకు రాణీగారి దర్శనం కావాలి," అని చెప్పాడు.

భటులు అతన్ని మందారవల్లి దగ్గిరికి తెచ్చారు. "ఏం కావాలి?" అని మందారవల్లి అతన్ని అడిగింది.

"నేను యువరాణిని పెళ్ళాడగోరి వచ్చాను," అన్నాడు మకరందుడు.

"నీ పేరేమిటి? నీది ఏ దేశం?" అని మందారవల్లి అడిగింది.

"మహారాణీ, నేనొక అనామకుణ్ణి. నేనెక్కడ ఉంటే అదే నా దేశం," అన్నాడు మకరందుడు.

కుర్రవాడు అందంగానే ఉన్నాడు. అందుచేత ఈ అనామకుణ్ణి తన కుమార్తెకు చేసుకో వచ్చు ననుకున్నది మందారవల్లి.



ఆమె మకరందుడితో, "నిన్ను యువరాణికిచ్చి పెళ్ళి చెయ్యటానికేమీ అభ్యంతరంలేదు. కాని, ముందుగా నీకొక సంగతి చెప్పాలి. యువరాణి నా అనంతరం రాణి కాబోతుంది. ఆమె పట్ల నువు జీవితాంతం వరకూ వినయవిధేయతలు చూపాలి. భర్తను గదా అని నువు ఆమె పై ఎలాటి అధికారమూ చూపగూడదు," అన్నది.

మకరందుడు ఆమె మాటలు గ్రహించి నట్టుగా తల ఆడించాడు. మందారమాలకూ, అనామకుడికీ పెళ్లి స్థిరమయింది.

మందారమాలతో ఆమె తండ్రి రహస్యంగా, "అమ్మా, నువు ఈ పెళ్ళికి ఒప్పుకోకు. నీకన్న హీనుడైన భర్తతో నువు సుఖపడలేవు. మీ అమ్మ మూర్ఖురాలై, మొగుడులాగా బతుకుతున్నది; నీ బతుకు కూడా తన బతుకులాగే ఉండాలని చూస్తున్నది!" అన్నాడు.

మందారమాల తనకు కాబోయే భర్తను ఒంటరిగా కలుసుకుని, "నువు నన్ను పెళ్ళి చేసుకుని సుఖపడవు. పౌరుషహీనుడైన భర్తను స్త్రీ ప్రేమించదు. నీకన్న పెద్ద హోదాగల భార్యతో నువు మాత్రం ఏమి సుఖపడతావు?" అన్నది.

మకరందుడు నవ్వి, "నా సంగతి నేను చూసుకుంటాను. నువు నన్ను ప్రేమించే టట్టు కూడా చెయ్యగలననుకుంటున్నాను. నువు నిశ్చింతగా ఉండు. నీ కోసం చాలా దూరం నుంచి వచ్చాను. నా కోరిక తీరబోతూండగా వెనక్కు తీస్తానా?" అన్నాడు.



అతని ధైర్యానికి తగిన కారణం ఉండే ఉంటుందనుకున్నది మందారమాల.

మందారమాలకూ, మకరందుడికీ పెళ్ళి జరిగింది. మకరందుడు అందరూ చూస్తూండగానే మందారమాల చెయ్యి పట్టుకుని, "పద!" అంటూ తన మందిరానికి బయలుదేరాడు.

మందారవల్లి ఉగ్రురాలై తన భటులతో, "అతన్ని పోనివ్వకండి!" అన్నది.

మకరందుడు తనకు సమీపంలో ఉన్న భటుడిచేతిలో ఉన్న కత్తి లాగుకుని, "ఎవరన్నా నాకు అడ్డం వచ్చారంటే చంపేస్తాను!" అన్నాడు. అతని కేసి రావటం మొదలుపెట్టిన భటులు వెనక్కు తగ్గారు.

మకరందుడు మందారవల్లి కేసి తిరిగి, "నేను నీ భర్తలాగా అసమర్థుణ్ణి కాను! ఇంత తిండి తిని కుక్కలాగా పడి ఉండను!" అన్నాడు.

మందారవల్లి తన కూతురు కేసి చూసి, "ఆ దౌర్భాగ్యుడు అలా పేలుతుంటే చూస్తూ ఊరుకుంటావేం?" అన్నది.

"నా భర్త పౌరుషవంతుడైతే నేనెందుకు కాదనాలి? నీ భర్త పనికిమాలిన వాడైతే నీకు సిగ్గులేదని, నాక్కూడా ఉండదనుకున్నావా?" అన్నది మందారమాల తల్లితో.

ఇదంతా చూస్తున్న మందారవల్లి భర్త కత్తి ఒకటి పట్టుకుని, "నా భార్యను అవమానించినందుకు నీకు తగిన బుద్ధి చెబుతాను," అంటూ యుద్ధానికి దిగాడు.

మకరందుడు ఆయనతో యుద్ధం చేసి, కావాలనే ఓడిపోయాడు. మందారవల్లి భర్త పరాక్రమాన్ని అందరూ పొగడుతూ ఉంటే, వాళ్ళంతా తనను కూడా అభినందిస్తున్నట్టు మందారవల్లికి తోచింది. ఈ కొత్త అనుభవంతో ఆమెలో చిత్రమైన మార్పువచ్చింది. ఆమెకు తన భర్త మీద ఏనాడూ లేనంత అభిమానం పుట్టుకొచ్చింది. తన కూతురికి పొగరూ, సాహసమూ గల భర్త దొరికినందుకు ఆమె సంతోషించింది. మకరందుడు అనామకుడు కాడనీ, అతను మధురాపురపు యువరాజనీ తెలిసి మందారవల్లి మరింత సంతోషించింది.






# చాకలివాడు మేలు

ఒకప్పుడు విజయనగరంలో ఒక ప్రసిద్ధ జ్యోతిష్కుడు ఉండేవాడు. ఆయన జ్యోతిశ్శాస్త్రంలో ఎన్ని గ్రంథాలున్నాయో అన్నీ చదివాడు. ఆ శాస్త్రంలో ఆయనకు తెలియనిది లేదు. అందుచేత ఎందరో రాజులు ఆయన మీద ఆధారపడి ఏ పని అయినా తలపెట్టేవాళ్ళు. ఎవరెవరికి యుద్ధాలు ఎప్పుడు జరుగుతాయో, వాటిలో ఎవరు గెలుస్తారో, ఎవరు ఓడుతారో, ఏ రాజ్యాలు ఎప్పుడు చేతులు మారుతాయో ఆయన పొల్లుపోకుండా చెప్పేవాడట!

ఆయనకు వ్యవసాయమంటే చాలా ఇష్టం. మిగతా వేళలలో ఎక్కడ వున్నా, పొలాలు కోసి నూర్పిళ్ళు చేసే తరుణంలో ఆయన తన గ్రామం చేరి, దగ్గర ఉండి పనులు చేయించేవాడు.

ఒక ఏడు కుప్పలు నూర్పించి, ధాన్యం కళ్ళాలలో రాశి పోయిస్తున్నాడు జోస్యులు గారు. ఆ సమయంలో ఆ వూరి చాకలి తిప్పడు గాడిదను తోలుకుంటూ డొంక వెంబడి ఇంటికి పోతూ ఆగి, "శాస్త్రుల్లు గారూ, ధాన్యం ఇంకా కళ్ళంలోనే ఉండనిచ్చారేం? దబ్బున గోతాలకు పట్టించి ఇంటికి చేర్చండి. పెద్ద తుఫాను రాబోతున్నది," అన్నాడు.

జ్యోతిష్కుడు నవ్వి, "ఈ సమయంలో తుఫాను రావటమేమిట్రా, తిప్పడూ? సూర్యుడింకా ఫలానా రాశిలోనే ఉన్నాడు. దక్షిణపు గాలి వీస్తున్నది. ఆకాశాన ఎక్కడా కనుచూపు మేరలో మబ్బు తునక లేదు. వర్షం కలిగించే గ్రహా లేవీ బలంగా లేవు," అంటూ తన శాస్త్ర మంతా చదివాడు.

"నాకా గ్రహాలూ, నక్షత్రాలూ ఏం తెలుస్తాయండి? నాకు తెలిసిందల్లా, పొద్దూకే వేళకు మానులు విరిగిపడేంత తుఫాను

---

ఎం. ఆదినారాయణశర్మ

---

రాబోతున్నది. తమరు నష్టపోతారని హెచ్చరించాను,'' అంటూ తిప్పడు తన గాడిదను తోలుకుని ఇంటికి వెళ్ళిపోయాడు.

'' పట్టి పామరుడు! శాస్త్రం వాడికేం తెలుస్తుంది? ఈ తరుణంలో వాన కురిపించటం ఇంద్రుడికి కూడా సాధ్యం కాదు,'' అన్నాడు జ్యోతిష్కుడు పని మనుషులతో.

కాని, సూర్యుడు అస్తమించే సమయంలో గాలి దక్షిణం నుంచి పడమరకు మారి, వెర్రిగా వీచ సాగింది. ఆ గాలికి ఇళ్ళ కప్పులు ఎగిరిపోయాయి, మహా వృక్షాలు వేళ్ళతో సహా పడిపోయాయి. క్షణంలో ఆకాశమంతా కారుమబ్బులు కమ్మి, మెరుపులూ, ఉరుములూ ఆరంభమయాయి. కొద్ది సేపటికి కుంభవర్షం కురియసాగింది.

పొలాలలో పని చేసుకుంటున్నవాళ్ళు ఎక్కడి పను లక్కడ వదిలేసి ఇళ్ళకు పోయారు. జ్యోతిష్కుడు కూడా ఇల్లు చేరి, '' రాశి అంతా మట్టిపాలే!'' అనుకున్నాడు.

చాకలితిప్పడు చెప్పిన మాట చెవిన పెడితే ఇలా జరిగేది కాదు. ఇంత శాస్త్రమూ తెలిసి తాను కనుక్కోలేకపోయిన తుఫాను గురించి తిప్పడికి ఎలా తెలిసిందా అని జ్యోతిష్కుడు అమిత ఆశ్చర్యం పొందాడు చదువు రాని చాకలి! వాడై ఈ జ్యోస్యం చెప్పి ఉండడు. వాడికి ఎవరో చెప్పి ఉంటారు. ఆ చెప్పినవాళ్లు మహానుభావులు. తన కన్న కూడా బాగా శాస్త్రం చదివినవారు. తిప్పణ్ణి అడిగి వారి పరిచయం చేసుకోవాలి అని నిశ్చయించుకున్నాడు జ్యోతిష్కుడు.



మర్నాడు ఉదయానికి గాలీ, వానా తగ్గిపోయాయి. జ్యోతిష్కుడు తిన్నగా చాకలి ఇంటికి వెళ్ళి, "ఒరే తిప్పా! నిన్న నువు చెప్పినట్టే తుఫాను వచ్చిందిరా. అలా వస్తుందని నీకు తెలియటానికి వీల్లేదు. అ చెప్పినది ఎవర్రా?" అని అడిగాడు.

"తమరన్నది నిజమే, శాస్త్రుల్లుగారూ! తుఫాను రాబోతున్నదని నాకు చెప్పినది నా గాడిద. తుఫాను రాబోయే ముందు అది వీపు విల్లంబు లాగా వంచి, చెంట్రుకలు నిక్కబొడిచి, తోక కాళ్ళ సందున ముడిచి, వణకటం మొదలుపెడుతుంది. నిన్న అది అలాగే చేసింది. అందుకే, తుఫాను రాబోతున్నదని నేను తమకు చెప్పగలిగాను," అన్నాడు తిప్పడు.

"ఇంత శాస్త్రం చదువుకున్న నేను తెలుసుకోలేని విషయం గాడిదకు తెలుస్తుందంటే నమ్మబుద్ధి కావటం లేదురా," అన్నాడు జ్యోతిష్కుడు.

"అదేం మాట, శాస్త్రుల్లుగారూ? ఇంకో జాముకు తెల్లవారుతుందనగా కోడి కుయ్యదా? సముద్రం మీద ఉప్పెన వచ్చే ముందు, నీటిగుర్రాలు పడవల చుట్టూ ఎగురుతాయట! వాటికి ఉప్పెన సంగతి ముందుగా ఎలా తెలుస్తుందంటే ఏం చెప్పగలం?" అన్నాడు తిప్పడు.

జ్యోతిష్కుడు ఒక నిట్టూర్పు విడిచి, "సరే, జరిగిన సంగతి మాత్రం ఎవరికీ చెప్పకు, నా పరువు కాస్తా పోతుంది," అన్నాడు.

"మీ పరువు పోగొట్టిందాకా నా కేం పని, శాస్త్రుల్లుగారూ?" అన్నాడు తిప్పడు.

అయినా జ్యోతిష్కుడి పరువు పోనే పోయింది. అయనకూ తిప్పడికీ పొలంలో జరిగిన సంభాషణ విన్నవాళ్ళు జరిగినదంతా ప్రచారం చేశారు. అందుకే ఆ ప్రాంతాల చాలాకాలం దాకా జ్యోతిష్కులు తగాదా పడ్డప్పుడు, "నువు తిప్పడి గాడిదంత తెలివిగలవాడి ననుకుంటున్నావు! కొంచెం తగ్గు!" అనేవాళ్ళు.

చదువుకున్నవాడి కన్న చాకలి మేలు అన్న సామెత ప్రచారంలోకి బాగా వచ్చింది.





# పెంపుడుకొడుకు

ఒక గ్రామం చివరన, అడవికి దగ్గిరగా కుటీరం వేసుకుని ఒక వయసుమళ్ళిన స్త్రీ తన కొడుకుతో సహా జీవిస్తూ ఉండేది. ఆమె రోజూ అడవికి వెళ్ళి, మోదుగ ఆకులూ, చీపిరిపుల్లలూ తెచ్చేది. మోదుగ ఆకులతో విస్తళ్ళు కుట్టేది. చీపిరిపుల్లలతో చీపిరికట్టలు కట్టేది. అవి అమ్మి, ఆ డబ్బుతో, సంసారం నడిపేది.

ఆమె కొడుకు వట్టి అప్రయోజకుడు. తల్లికి సహాయ పడకపోగా, డబ్బు తెమ్మని పీడించేవాడు. తల్లి వాణ్ణి లక్ష్యపెట్టటం మానేసింది. వాడుకూడా తల్లితో విసిగి ఎటో వెళ్ళిపోయాడు.

ఆమెకు క్రమంగా శక్తి ఉడుగుతూ వస్తున్నది. ఒకనాడు అడవిలో పుల్లలు ఏరుతూ, ఎండ దెబ్బకు సొమ్మసిల్లి పడిపోయింది. ఆ సమయంలో ఒక యువకుడు అటుగా వచ్చి, పడిపోయిన ముసలిదాన్ని చూశాడు. వెంటనే వాడు సమీపంలో ఉన్న నీటిమడుగు నుంచి నీరు తెచ్చి, ముసలి దాని ముఖాన కొట్టి, కొద్ది సేపటికల్లా స్పృహ తెప్పించాడు.

ముసలిది లేచి కూర్చుని, "ఎవరు, నాయనా, నువు?" అని అడిగింది.

"నేను దిక్కులేని ఒంటరిగాణ్ణి, తల్లీ. ఎక్కడన్నా ఎవరన్నా దగ్గిర పెట్టుకుంటా రేమోనని ఊళ్ళ వెంట తిరుగుతున్నాను," అన్నాడు యువకుడు.

ముసలిది లేచి, తాను కట్టుకున్న పుల్లల మూట నెత్తికి ఎత్తుకోబోయింది. యువకుడు ఆమెను వారించి, మూట తన నెత్తికి ఎత్తుకుని, "పదమ్మా, దీన్ని మీ ఇంటి దాకా తెస్తాను," అన్నాడు.

ఇంటికి వెళ్లాక ముసలిది వాడితో, "నీకు మంచి చోటు దొరికేదాకా నా యింటోనే ఉండు, నాయనా!" అన్నది.

కొళ్ళ గోవిందరావు

వాడు ఇంకెక్కడికీ వెళ్ళలేదు. ముసలి దాని వెంటే ఉండి, ఆమెను ఏ పనీ చెయ్యనివ్వక, ఆమె చేసే కష్టమైన పను లన్నీ తానే చురుకుగా చేస్తూ, అక్కడే ఉండిపోయాడు.

ముసలిది ఇప్పుడు మోదుగాకుల కోసమూ, మూలికల కోసమూ మాత్రమే అడవిలోకి అప్పుడప్పుడూ వెళుతున్నది. ఇద్దరూ తమ శక్తికొద్దీ సంపాదిస్తున్నారు. ఖర్చుకు పోగా డబ్బు మిగులుతున్నది.

ముసలిదాని కొడుకు ఒకనాడు ఎక్కడి నుండో ఊడిపడ్డాడు. ఇంటి పరిస్థితి బాగయిందని గ్రహించాడు. తల్లిని డబ్బు కోసం పీడించాడు. తల్లి చిల్లిగవ్వ కూడా ఇవ్వనన్నది.

ముసలిదాని అసలు కొడుకు పెంపుడు కొడుకుతో తగాదాలు పెట్టుకున్నాడు. కొత్త వాణ్ణి ఏ విధంగానన్నా పంపేస్తే తల్లి తనని ఆదరిస్తుందని వాడి నమ్మకం.

వాళ్ళు ఇద్దరూ ఇంట్లో లేని సమయంలో ఆమె డబ్బంతా మూటగట్టి రహస్యంగా దాచి, ఇంట్లో ఉన్న వస్తువులు చిందర వందరగా పారేసి, ఏడుస్తూ కూర్చున్నది.

ఇంతలో ముసలిదాని అసలు కొడుకు వచ్చాడు. ఇంట్లో దొంగలు పడ్డారని ముసలిది చెప్పింది.

"నువు వట్టి పాపిష్టిదానివి. డబ్బు నా కియ్యమంటే ఇచ్చావుకావు. నీకు తగిన శాస్తే జరిగింది. నీ మొహం చూస్తే పాపం! నీ యింట ఒక్క క్షణంకూడా ఉండను!" అంటూ ముసలిదాని అసలు కొడుకు వెళ్ళిపోయాడు.

వాడు వెళ్ళిపోక ముందే ముసలిదాని పెంపుడు కొడుకు వచ్చి, జరిగినదంతా చూశాడు. తరవాత వాడు ముసలిదాన్ని ఓదార్చుతూ, "ఏడవకమ్మా! పోతే పోయింది, మనం సంపాదించిన డబ్బే గదా! మళ్ళీ సంపాదింతాం!" అన్నాడు.

"డబ్బెక్కడికి పోయింది, నాయనా! ఆ వెధవ వెళ్ళిపోయాడు. డబ్బు భద్రంగానే ఉన్నది," అంటూ ముసలిది దాచిన చోటినుంచి డబ్బుమూట బయటికి తీసింది.



# పువ్వుల కంపు!

ఒక బెస్తమనిషి చేపలు అమ్ముకుని తిరిగి ఇంటికి వెళుతున్నది. మధ్య దారిలో హఠాత్తుగా పెద్ద వర్షం పట్టుకున్నది. బెస్తమనిషి బాగా తడిసిపోయి, చలికి వణుకుతూ, ఒక ఇంటి అరుగు మీద నిలుచున్నది.

ఆ ఇంట్లో పువ్వులమ్ముకునే మనిషి ఉంటున్నది. ఆమె చేపలమ్మిని లోపలికి పిలిచి, కట్టుకునేందుకు గుడ్డలిచ్చి, భోజనం పెట్టి, పడుకునేందుకు స్థలం చూపించింది. చేపలమ్మి ఎంతో సంతోషించి, పువ్వులు నిలవచేసే గది పక్కనే పడుకున్నది.

చేపలమ్మికి పూలవాసన పడక, కడుపులో వికారం పుట్టుకొచ్చింది. నిద్రపట్టలేదు. ఆమె లేచి వెళ్ళి తన చేపల తట్ట తెచ్చి తలదగ్గిర పెట్టుకుని పడుకున్నది. చేపల సువాసనకు వెంటనే నిద్ర పట్టి, చేపలమ్మి హాయిగా నిద్రపోయింది!

—పోకల అనూరాధ






# వడ్డీక్రమం

ఒక గ్రామంలో ఒక పేదవాడు ఉండేవాడు. వాడు కోటీశ్వరుడు కావాలని కలలు కంటూ ఉండేవాడు. కాని వాడు బతికి ఉన్నంత కాలమూ కష్టపడి రెండు బంగారు మొహరీలు మాత్రమే కూడబెట్టగలిగాడు.

అతను చనిపోబోతూ తన కొడుకును పిలిచి, "నాయనా, నేను కోటీశ్వరుణ్ణి కావాలని నా జీవితమంతా కలలుకన్నాను. కాని, ఎంత ప్రయత్నించి కూడా, నేను రెండు మొహరీల కన్న చేర్చలేక పోయాను. పాటుపడటం తప్ప నాకు ఇంకేమీ చేత కాదు. నువ్వంటే చదువుకున్న వాడివి. నేను మిగిల్చిన బంగారంతో వ్యాపారం ప్రారంభించి, నువ్వయినా కోటీశ్వరుడివైతే, నా ఆత్మ సంతోషిస్తుంది," అన్నాడు.

ఆ పేదవాడి కొడుకు పేరు శ్రీమంతుడు. అతను తన తండ్రి కోరిక తీర్చాలనీ, తండ్రి తనకు పెట్టిన పేరు సార్థకం కావాలనీ నిశ్చయించుకుని, రెండు మొహరీలతోనూ ఉన్న ఊళ్ళోనే వ్యాపారం ప్రారంభించి, డబ్బు సంపాదించ సాగాడు.

కొంతకాలం అయాక అతని వ్యాపారం ఒకస్థాయికి వచ్చి, అభివృద్ధి కావటం మానేసింది. అప్పుడు శ్రీమంతుడు రాజధానికి చేరి, తాను కూడబెట్టిన డబ్బుతో ఇంకా పెద్ద పెద్ద వ్యాపారాలు చేసి, రెండు చేతులా డబ్బు ఆర్జించనారంభించాడు.

ఇలా ఉండగా ఆ ప్రాంతానికి కాటకం వచ్చింది. ధాన్యం ఎక్కడెక్కడి నుంచో రావలిసి వచ్చింది. బీదవాళ్ళు ధనికుల వద్ద పెద్ద పెద్ద వడ్డీలకు అప్పులు తీసుకుని, ఇళ్ళూ వాకిళ్ళూ తాకట్లు పెట్టసాగారు.

ఈ పరిస్థితి చూసి శ్రీమంతుడు తన డబ్బుతో వ్యాపారం చెయ్యటం నిలిపివేసి, ఆ డబ్బును బీదవాళ్ళకు తక్కువ వడ్డీకీ, నిరుపేదలకు వడ్డీ తీసుకోకుండానూ అప్పు

సి. ఎల్. ప్రసాద్



పెట్టసాగాడు. ఇది మిగిలిన వడ్డీవ్యాపారస్తులకు నచ్చలేదు. అందుచేత, అతని వద్ద నగదు మిగలకుండా చెయ్యాలని ధనికులు కూడా అతని వద్దకు పెద్ద మొత్తాలు అప్పు కావాలని వచ్చారు. శ్రీమంతుడు వారిని చాలా హెచ్చు వడ్డీ అడిగాడు.

వడ్డీవ్యాపారులు వెళ్ళి రాజుగారితో, "మహారాజా, మన నగరానికి కొద్దికాలం క్రితం వచ్చి, వ్యాపారం చేసి గొప్పధనికుడై కూర్చున్న శ్రీమంతుడు అనేవాడు ఒక్కొక్కరికి ఒక్కొక్క వడ్డీ చెబుతున్నాడు. ఇలాటి పక్షపాతం ధర్మవిరుద్ధం. అందుచేత తమరు ఈ దుష్టుణ్ణి విచారించి, తగిన శిక్ష విధించాలి," అని ఫిర్యాదు చేశారు.

రాజు తొందరపడి శ్రీమంతుడిపై చర్య తీసుకోక, ఒక ధనికుడి వేషం వేసుకుని శ్రీమంతుడి వద్దకు వెళ్ళి, పెద్ద మొత్తం అప్పు కావాలని అడిగాడు. శ్రీమంతుడు పెద్ద వడ్డీ అడిగాడు. రాజు అంత వడ్డీ ఇవ్వ నిరాకరించి, తన భవనానికి తిరిగి వెళ్ళి పోయాడు.

మర్నాడు రాజు సభచేసి ఉన్న సమయంలో రాజభటులు వచ్చి, శ్రీమంతుణ్ణి రాజసభకు తీసుకుపోయారు. రాజు అతన్ని చూసి, "నువు వడ్డీ వ్యాపారం చేసేటప్పుడు అందరివద్దా ఒకే పద్ధతిలో వడ్డీ పుచ్చుకోక పక్షపాతం చూపుతా వెందుకు? వ్యాపారంలో ఇలాటి పక్షపాతం అధర్మం కాదా? నీ మీద ఈ ఆరోపణ వచ్చినప్పుడు నేను నమ్మక, స్వయంగా నిజం తెలుసుకునేటందుకు మారువేషంలో నిన్ను అప్పు అడిగాను. నువు నన్ను పెద్ద వడ్డీ అడిగావు. అనేక మందికి నువు వడ్డీ లేకుండానే అప్పు లిచ్చినట్లు నేను విన్నాను. దీనికి ఏమంటావు?" అని అడిగాడు.

"మహారాజా, నేను అందరివద్దా ఒకే పద్ధతిలో వడ్డీలు పుచ్చుకోని మాట నిజమే. అయితే అందులో పక్షపాతంగాని, అధర్మం కాని ఏమీలేదు. కొంచెం ఆలోచించగల వారి కెవరికైనా ఆ సంగతి తెలుస్తుంది," అన్నాడు శ్రీమంతుడు.

రాజు శ్రీమంతుణ్ణి పంపేసి, తన మంత్రులతో చాలా సేపు ఆలోచించాడు, కాని శ్రీమంతుడు చేసినది అధర్మం ఎందుకు కాదో ఎవరికీ అర్థంకాలేదు. ఒకే వస్తువు ధర పదిమందికి పదిరకాలుగా చెప్పటం వ్యాపారధర్మానికి విరుద్ధం కాక ఏమవుతుంది? మంత్రులు కూడా ఈ సమస్య విడగొట్టలేక పోయారు.

"శ్రీమంతుడు తాను చేసిన పని అధర్మం కాదంటున్నాడు. అది ఎలా ధర్మమో వివరంగా చెప్పిన వారికి కోరినది ఇస్తాను," అన్నాడు రాజు.

రాజుకు ఒక కుమార్తె ఉన్నది. ఆమె గొప్ప సౌందర్యవతే కాక, బాగా చదువు సంధ్యలు నేర్చినది. శ్రీమంతుడు రాజ సభకు వచ్చినప్పుడు ఆమె అతన్ని చూసింది. అతని వాలకమూ, మాట్లాడే తీరూ, తెలివి తేటలూ, అందచందాలూ ఆమెను ఎంతగానో ఆకర్షించాయి.

ఆమె రాజును, "ఆ శ్రీమంతుడు చేసిన పని అధర్మంకాదని నేను రుజువు చెయ్యగలను. నేను కోరినది ఇస్తావా?" అని అడిగింది.

"ఎవరికైనా ఇస్తానన్నప్పుడు నీ కెందుకివ్వను, తల్లీ?" అన్నాడు రాజు.

"అయితే విను. శ్రీమంతుడి మీద నీతో ఫిర్యాదు చేసిన వారందరూ ఈ కాటకంలో హెచ్చు వడ్డీలకు అప్పులిచ్చిన వాళ్ళే. వాళ్లు శ్రీమంతుడి వద్ద తక్కువ వడ్డీకి అప్పు తీసుకుని, పేదలకు హెచ్చు వడ్డీకి అప్పులివ్వటానికి ప్రయత్నించారు. తన డబ్బుతో వారు లాభం పొందకుండా శ్రీమంతుడు జాగ్రత్త పడ్డాడు. అది వ్యాపారధర్మమే," అన్నది రాజకుమార్తె.

తన కూతురు చెప్పినమాట రాజుకు తృప్తి కలిగించింది.

"అయితే నువు ఏం కోరుకుంటావో, కోరుకో," అన్నాడు రాజు.

"నన్ను శ్రీమంతుడికి ఇచ్చి పెళ్ళి చెయ్యి," అన్నది రాజకుమార్తె.

రాజు శ్రీమంతుడికి తన కుమార్తె నిచ్చి పెళ్ళి చేసేశాడు.



# తెలివైన కన్ను

ఒక గుడ్డివాడూ, కుంటివాడూ కలిసి ప్రయాణం చెయ్యవలసి వచ్చింది. కుంటివాడు గుడ్డివాడి భుజాల మీద ఎక్కి కూర్చుని గుడ్డివాడికి దారి చెప్పాడు.

ఇలా కొంతదూరం వెళ్ళాక కుంటివాడు గుడ్డివాడితో, "ఇక్కడ సపోటాచెట్ల తోట ఉన్నది. చెట్లకు కాయలున్నాయి," అన్నాడు.

"తోట చుట్టూ కంచె ఉన్నదా?" అని గుడ్డివాడు అడిగాడు.

లేదన్నాడు కుంటివాడు.

"జనసంచారం ఏమన్నా ఉన్నదా?" అని గుడ్డివాడు మళ్ళీ అడిగాడు. లేదన్నాడు కుంటివాడు.

"తోటకు ఎవరన్నా కాపలా ఉన్నారా?" అని గుడ్డివాడు మూడోసారి అడిగాడు.

లేరన్నాడు కుంటివాడు.

"అలా అయితే అవి తినటానికి పనికి వచ్చే కాయలు కావు," అన్నాడు గుడ్డివాడు. కుంటివాడి మంచి కన్ను కన్న గుడ్డివాడి గుడ్డి కన్ను తెలివైనది.

—దంతులూరి వెంకటరాయపరాజు





# న్యాయమైన సొమ్ము

పూర్వం మలయదేశాన్ని పరిపాలించిన ధనపాలుడికి అంగబలంలోనూ, అర్థబలంలోనూ అమితమైన విశ్వాసం ఉండేది. బలమైన సేనా, ఖజానాలో పుష్కలంగా డబ్బూ ఉన్నంత కాలమూ దేశానికి ఏ కొరతా లేదని ఆయనకు గుడ్డి నమ్మకం. అందుచేత ఆయన ప్రజల ద్వారా పన్నుల రూపంలో వసూలు చేసిన సొమ్ములో సగం సైన్యాన్ని పోషించటానికి ఖర్చు చేసి, మిగతాది తన ఖజానాలో చేర్చి, అంతకంతకూ పెరిగే ఆ ధనాన్ని చూసుకుని మురిసిపోతూ ఉండేవాడు. ఆయన ప్రజాసంక్షేమం కోసం తన బొక్కసం నుంచి చిల్లిగవ్వ కూడా ఖర్చు పెట్టేవాడు కాడు. ప్రజలు తమ మంచి చెడ్డలు తామే చూసుకోవటానికి అలవాటు పడ్డారు.

కాని ధనపాలుడి మంత్రి అనేక దేశాలు చూసినవాడు. రాజు అవలంబించిన పద్ధతి మంచిది కాదనీ, దేశానికి బలం ప్రజలేననీ, రాజధనం ప్రజాసౌకర్యాలకు వినియోగపడటమే న్యాయమనీ, మంత్రి రాజుతో అన్నాడు.

మంత్రి మాట వింటే తన ధనం తరిగిపోతుందని భయపడి రాజు ఆ మంత్రిని దేశం నుంచి వెళ్ళగొట్టాడు.

మర్నాడు దేశం పొలిమేరలో కనిపిస్తే రాజు తన తల తీయిస్తానని బెదిరించటం చేత మంత్రి ఆ రోజే అరణ్యాలలోకి వెళ్ళిపోయాడు. అరణ్యాలలోకి వెళ్ళిపోయిన మంత్రిని దొంగలు చుట్టుముట్టి, తమ నాయకుడైన చండవిక్రముడి వద్దకు తీసుకుపోయారు.

ఆయన మలయదేశపు మంత్రి అని తెలియగానే చండవిక్రముడు, తననూ, తన అనుచరులైన రెండువందలమంది దొంగలనూ పట్టుకోవటానికే ఆయన అరణ్యానికి

జి. సుందరమూర్తి

వచ్చా డనుకుని, ఆయనను చంపించటానికి ఆలోచన చేశాడు.

"దేశంలో కనిపిస్తే రాజు చంపేస్తానంటే ఇక్కడికి వచ్చాను. ఇక్కడ మీరు నన్ను చంపేస్తా నంటున్నారు. ఎలాగూ నాకు చావు తప్పేట్టు లేదు. అయితే నాది ఒక కోరిక. మలయరాజు ఖజానాలో అంతులేని ధనం మూలుగుతున్నది. దాన్ని మీరైనా అనుభవిస్తే నేను తృప్తిగా చచ్చిపోతాను," అన్నాడు మంత్రి.

ఈ మాటతో చండవిక్రముడి అనుమానం మరింత అయింది. మలయ సైనికులు మహాబలశాలులని అతను విని ఉన్నాడు. అందుచేత అతనుగాని అతని అనుచరులుగాని ఎన్నడూ నగరం కేసి దొంగతనాలకు పోలేదు. అరణ్యంలో ఉండే దొంగల మాట నగరంలో ఎవరికీ తెలియదు కూడా. తననూ, తన ముఠానూ ఆ సైనికుల వశం చెయ్యటానికే మంత్రి ఇలా అన్నాడని సందేహించి చండవిక్రముడు, "రాజుగారి ఖజానా దోస్తాము. కాని మా పని పూర్తి అయేదాకా నువు నా వెంటనే ఉండాలి. మోసం చేసేందుకు ప్రయత్నించావో తక్షణం నీ తల తీసేస్తాను," అన్నాడు మంత్రితో.

మంత్రి అందుకు సమ్మతించి, రాజసైనికులు వట్టి తిండిపోతులే గాని వాళ్ళకు పోరాడే శక్తి ఏమీ లేదని దొంగల నాయకుడికి చెప్పి, దొంగల వెంట అర్ధరాత్రివేళ తాను కూడా రాజప్రాసాదం వద్దకు వచ్చాడు.



తమ కోసం సైనికులు భారీ ఎత్తున మాటు వేసి లేరని దొంగల నాయకుడు రూఢి చేసుకున్నాడు. పహరావాళ్ళు కొద్దిమంది ఉన్నారు గాని, వాళ్ళను బంధించడం దొంగలకు ఏమీ కష్టమనిపించలేదు. తరవాత వాళ్ళు రాజును కూడా బంధించారు. వాళ్ళు ఖజానా కొల్లగొట్టి, ధనపు సంచులను గుర్రాల మీది కెక్కించారు.

"ఈ సొమ్ముతో మీరు సుఖంగా బతకండి. దొంగతనాలు మానెయ్యండి. ఇక మీ దారి మీదీ, నా దారి నాదీ!" అన్నాడు మంత్రి దొంగల నాయకుడితో.

అప్పుడు దొంగలనాయకుడికి ఒక గొప్ప ఆలోచన వచ్చింది.

"నేను రాజును బంధించాను గదా, నేనే రాజు నౌతాను. ఏమంటావు?" అని అతను మంత్రితో అన్నాడు.

దొంగలనాయకుడు ఇలా అనగానే మంత్రికి ఒక ఆలోచన వచ్చింది.

"అలా అయితే ఈ సొత్తు అంతా ఎక్కడికో మోసుకుపోవటం దేనికి? ఖజానాలోనే ఉండనివ్వండి," అన్నాడాయన దొంగల నాయకుడితో.

"నిజమే," అని దొంగలనాయకుడు తన అనుచరుల చేత గుర్రాల మీది మూటలన్నీ దింపించి, ఖజానాలోకి పట్టించుకు పోయాడు. వాళ్ళందరూ ఖజానాలో ఉండగా మంత్రి ఖజానాకు తాళం పెట్టేశాడు.

తరవాత మంత్రే రాజునూ, కాపలా వాళ్ళనూ బంధవిముక్తుల్ని చేసి, "చూశారా, మహారాజా? మీ ఖజానాను కొల్లగొట్టటం దొంగలకు ఎంత సులువో? మీ భటులు తినమరిగి కాపలా కాయటానికి కూడా పనికిరానివాళ్ళయి పోయారు. ఈ సొమ్ము ప్రజాసౌకర్యాలకు వినియోగించినప్పుడే న్యాయమైన సొమ్ము. లేకపోతే అది మీ దగ్గర ఉన్నా ఒకటే, దొంగలు దోచుకున్నా ఒకటే. దీని వల్ల దేశానికి ఏమీ లాభం ఉండదు," అన్నాడు.

రాజుకు బుద్ధివచ్చింది. అదిమొదలు రాజు మంత్రి చెప్పినట్టు వింటూ, ధనాన్ని ప్రజా సంక్షేమానికి వినియోగిస్తూ వచ్చాడు.



# కొడుకు చేసిన మేలు

ఒక ఊళ్ళో సోమన్న అనే పేద రైతు ఉండేవాడు. వాడు పేదవాడై కూడా చాలా దుర్మార్గుడు. అందరినీ ఏదో విధంగా హింస పెట్టేవాడు. సోమన్నకు రాము డనే కొడుకు ఉండేవాడు. వాడు చాలా తెలివిగలవాడు.

సోమన్న పొరుగున వెంకన్న అనే షావుకారు ఉండేవాడు. ఆ షావుకారు చచ్చిపోయినప్పుడు అతని కొడుకు డబ్బు ఖర్చుచేసి దానధర్మాలు విరివిగా చేసి, తండ్రికి మంచి పేరు తెచ్చాడు.

ఈ సంగతి సోమన్న ఎరుగును. అందుచేత, తన ఆఖరు ఘడియలు దగ్గిర పడ్డట్టు తోచగానే సోమన్న రాముణ్ణి పిలిచి, "నాయనా, షావుకారు వెంకన్న పేరు నిలబెట్టాడే అతడి కొడుకు, అలాగే నా ప్రాణం పోయాక నా పేరు నువ్వు నిలబెట్టాలి," అని ప్రాణం విడిచాడు.

కనీసం డబ్బు కూడా లేకుండా, దుర్మార్గుడైన తన తండ్రి పేరు ఎలా నిలబెట్టాలో తెలీక రాముడు చిట్టచివరకు ఒక బడిత పుచ్చుకుని, దారే పొయ్యేవాళ్ళందరినీ బాద సాగాడు.

"వీడి కన్న ఆ సోమన్నే నయం!" అన్నారు ఊరివాళ్ళు. —తిగల ప్రమీల






పాండవుల వృత్తాంతం విని ధృతరాష్ట్రుడు పశ్చాత్తాపపడటమూ, రానున్నదానిని గురించి భయపడటమూ శకుని గమనించి, ఆ సంగతి కర్ణుడితో చెప్పాడు. వాళ్ళిద్దరూ దుర్యోధనుడి దగ్గిరికి వెళ్ళి, ముసలిరాజు మథనపడుతున్నమాట చెప్పారు. అది విని దుర్యోధనుడికి దిగులు పుట్టింది.

అప్పుడు కర్ణుడు దుర్యోధనుడితో, "రాజా, నీ తెలివితేటలవల్ల అరణ్యాలలో అష్టకష్టాలూపడుతున్న పాండవులు దిగులు పడాలిగాని, వారి రాజ్యం కూడా వశపరచుకుని మహారాజువై సర్వసౌఖ్యాలూ అనుభవిస్తున్న నీకు దిగులెందుకు? పాండవులిప్పుడు ద్వైతవనంలో ఉన్నారట. ఈ స్థితిలో వాళ్ళ దగ్గిర నీ వైభవం ప్రదర్శించినట్టయితే వాళ్ళు మరింత ఏడుస్తారు. నీ రాణివాసస్త్రీలను చూసి ఆ ద్రౌపది కుళ్ళిపోవాలి," అన్నాడు.

శకుని కర్ణుడు చెప్పినట్టు చేసితీరాలన్నాడు.

ఇద్దరి మాటలూ విని దుర్యోధనుడు, "మీ ఆలోచన ఎంతో బాగున్నది. కాని నా తండ్రి మనని ద్వైతవనం వెళ్ళనిస్తాడా అని నా అనుమానం. అసలే ఆయన పాండవుల స్థితి చూసి పశ్చాత్తాపపడుతున్నట్టు మీరు చెప్పారు గద! అందుచేత మనం పాండవుల కష్టాలు కళ్ళారా చూసి ఆనందించటానికి ఉపాయం ఏదన్నా ఉంటుందేమో, మీరు దుశ్శాసనుడితో కూడా ఆలోచించి రేపు ఉదయం నాకు చెప్పండి.

33. ఘోషయాత్ర



మన ప్రయాణానికి భీష్ముడు కూడా ఒప్పుకోవలసి ఉంటుంది మరి. ఆ పెద్దవాళ్ళిద్దరినీ ఒప్పించే మార్గం ఆలోచించండి," అని శకుని కర్ణులను పంపేశాడు.

మర్నాడు కర్ణుడు వచ్చి, శకుని దుశ్శాసనులు వింటూండగా దుర్యోధనుడితో, "మన గోవులమందలు ద్వైతవనంలో ఉన్నాయి. వాటికి క్రూరమృగాల బాధ లేకుండా రక్షించే ఏర్పాట్లు చూడటం నీ విధి. అందుచేత, ద్వైతవనానికి ఆ పని మీద వెళతామంటే ముసలిరాజు తప్పక ఒప్పుకుంటాడు. మనం ఆర్భాటంగా ద్వైతవనానికి వెళ్ళి, పాండవులను అడలగొట్టి పద్దాం," అన్నాడు.

అందరూ చప్పట్లు చరిచి, కర్ణుడి ఆలోచనను ప్రశంసించారు. వాళ్ళు సమంగుడనే గొల్లవాణ్ణి పిలిచి, "నువ్వు మా వెంట పెద్దరాజు దగ్గిరికి వచ్చి, ఆయనతో మన ఆవులమందలు ద్వైతవనంలో ఉన్నాయని చెప్పు," అన్నారు.

ఆ గొల్లవాడు దుష్టచతుష్టయం వెంట ధృతరాష్ట్రుడి వద్దకు వచ్చి, "దేవా, మన ఆవులమందలు ఇప్పుడు ద్వైతవనంలో ఉన్నాయి. అక్కడ వాటికి చక్కని మేత ఉన్నది. మందలు క్షేమంగానే ఉన్నవి గాని, వాటికి క్రూరమృగాల బాధ ముందు ముందు లేకుండా కాపాడాలి. ఈ మాట చెప్పటానికే నేను వచ్చాను," అన్నాడు.

అప్పుడు కర్ణశకునులు ధృతరాష్ట్రుడితో, "దుర్యోధనుడు అక్కడికి వెళ్ళి క్రూర మృగాలను వేటాడితే మందలకు క్షేమం కలుగుతుంది. అదీగాక దూడలకు గుర్తులు వేయించటమూ, వాటి పోషణ ఏర్పాట్లు కూడా చూసి రావచ్చు," అన్నారు.

ఆ మాటలు విని ధృతరాష్ట్రుడు, "మందలను క్రూరమృగాల నుండి రక్షించటమైతే మంచిదేగాని, ఈ సమయంలో ద్వైతవనానికి వెళ్ళటం మంచి పని కాదు. జూదంలో ఓడిపోయి వనవాసం చేస్తున్న పాండవులు ఆ వనంలోనే ఉన్నారు. మీరు అక్కడికి పోతే ఏదో ఒక దురంతం జరగవచ్చు.

అందులో మీ తప్పేమీ లేకపోయినా, అప
కీర్తి మీకే వస్తుంది. మిగిలిన పాండవుల
నుంచి భయంలేదుగాని, భీముడు పగ
పట్టిన తాచులాటివాడు. ద్రౌపది కూడా
అలాటిదే. మీరు కూడా తొందర స్వభావం
కలవాళ్ళే. మీకూ మీకూ జగడం వచ్చిం
దంటే చాలా ప్రమాదం కలుగుతుంది.
ఇటీవలనే అర్జునుడు స్వర్గానికి వెళ్ళి,
దివ్యాస్త్రాలు తెచ్చాడట. మీరు అతనికి
చాలరు. అందుచేత గోవులరక్షణకు మీరు
వెళ్ళక, మరెవరినైనా పంపండి," అన్నాడు.

శకుని ధృతరాష్ట్రుడితో, "మేము ఎలాటి
ఒడుదుడుకులూ రానివ్వము. అసలు
మేము పాండవులున్న ప్రాంతానికే పోము.
కొద్ది రోజులపాటు వనవిహారం చేసి, గోవుల
మందలను పరీక్షించి, మా దారిన తిరిగి
వచ్చేస్తాము. పాండవులు కూడా ధర్మరాజు
మాట మీరి తొందరపాటు పనులు చేయరు.
ధర్మరాజు ధర్మమూర్తి గదా!" అన్నాడు.

ధృతరాష్ట్రుడు ఈ మాటలు నమ్మి,
"సరే, వెళ్ళి రండి!" అన్నాడు. దుర్యో
ధనుడు పరమానందంతో, కర్ణశకుని దుశ్శా
సనులను వెంటబెట్టుకుని, అనేకమంది
పౌరులూ, వారి భార్యలూ వెంటరాగా
ఘోషయాత్ర మీద బయలుదేరాడు. అతని
వెంట అనేకవేల రథాలూ, ఏనుగులూ,
గుర్రాలూ, సైన్యమూ, వేటగాళ్ళూ, వంది



మాగధులూ బయలుదేరారు. బళ్ళ మీద
రకరకాల వస్తుసామగ్రి వచ్చింది.

కొన్ని రోజులకు వీరంతా ద్వైతవనానికి
చేరి, శిబిరం ఏర్పాటు చేసుకున్నారు.
మందలన్నిటినీ పరీక్షించి, ఆవులనూ, ఎద్దు
లనూ, ఆబోతులనూ వేరువేరుగా ఏర్పాటు
చేసి, అన్నిటికీ గుర్తులువేసి, గోవులను
రక్షించేవారికి తగిన హెచ్చరికలు ఇచ్చి,
వారికి బహుమానాలిచ్చి, వారి ఆటపాటల
వినోదాలు చూసి ఆనందించారు. శిబిరానికి
కావలిసిన పాలూ, పెరుగూ వచ్చాయి.
వేటగాళ్ళు వేటాడి మాంసం తెచ్చారు.

దుర్యోధనుడు స్త్రీలనూ, కొడుకులనూ,
స్నేహితులనూ వెంటబెట్టుకుని వనవిహారం



చేస్తూ, వనసౌందర్యం చూసి ఆనందిస్తూ, ద్వైతవనం మధ్య ఉండే సరస్సు వద్దకు వచ్చి, దాని గట్టున విడిది చేశాడు.

అదే సరస్సు అవతలి గట్టున ధర్మరాజు ఆశ్రమం ఉన్నది. దుర్యోధనుడు చేరిన సమయానికి ధర్మరాజు తన వెంట ఉన్న బ్రాహ్మణుల సహాయంతో సద్యస్క మనే యజ్ఞం చెయ్యటానికి దీక్షలో ఉన్నాడు.

దుర్యోధనుడి ఆజ్ఞప్రకారం అతని సేవకులు సరస్సు ఇవతలి గట్టున కుటీరాలు నిర్మించే ప్రయత్నాలు ప్రారంభించారు. అప్పుడు, సరస్సుకు రక్షకులుగా ఉన్న గంధర్వ భటులు వారికి అడ్డం వచ్చి, "ఇక్కడ ఎవరూ విడియరాదని మా ప్రభువుగారి ఆజ్ఞ. మీరు యీ చోటు వదిలి మరెక్కడనైనా విడుదులు కట్టుకోండి," అన్నారు.

తన సేవకులు వచ్చి ఈ సంగతి చెప్పగానే దుర్యోధనుడు పొగరుగా తన సైనికులను పిలిచి, ఆ గంధర్వ భటులను తరిమివెయ్యమని ఆజ్ఞాపించాడు. వాళ్ళు వెళ్ళి గంధర్వ భటులతో, "దుర్యోధన మహారాజుగారు ఇక్కడ విహారంచేయ వచ్చారు. మీరు వెళ్ళిపొండి. లేకపోతే మీ ప్రాణాలు దక్కవు." అని భయపెట్టారు.

గంధర్వభటులు నవ్వి, "మీరు ఎవరిని భయపెడదా మనుకుంటున్నారు? మీ మహారాజంటే మేము లక్ష్యపెట్టేవాళ్ళం కాము. మా ప్రభువు చిత్రసేనుడనే గంధర్వరాజు. మీరు మర్యాదగా ఈ చోటు వదిలి, అవతలపక్క ఉన్న ధర్మరాజు ఆశ్రమం పక్కనే, మరొక చోటనే విడుదులు కట్టుకోండి. ఇది మా గంధర్వరాజు విహరించే స్థలం," అన్నారు.

ఈ సంగతి విని దుర్యోధనుడు తోక తొక్కిన తాచులాగా అయి, "నన్ను ఆజ్ఞాపించటానికి గంధర్వు లెవరు?" అని గంధర్వుల మీదికి తన సైన్యాన్ని యుద్ధానికి పంపాడు.

ఈ లోపుగా గంధర్వులు చిత్రసేనుడి ఆజ్ఞపొంది, దుర్యోధనుడి బలాలను తుక్కు

చేసేశారు. ఇదంతా దూరాన్నుంచి చూస్తున్న కర్ణుడు, దుర్యోధనుడు మెచ్చుకో గలందులకు గంధర్వభటుల మీద యుద్ధానికి వెళ్ళి, కొందరు భటులను చంపాడు. కాని అంతలోనే గంధర్వభటులు వేలసంఖ్యలో వచ్చిపడి కర్ణుణ్ణి చుట్టుముట్టారు. అది చూసి దుర్యోధనుడి తమ్ములు కర్ణుడికి సహాయం వెళ్ళారు. చిన్న కొట్లాట కాస్తా పెద్ద యుద్ధమై కూర్చుంది. చిత్రసేనుడే స్వయంగా యుద్ధానికి వచ్చాడు.

చిత్రసేనుడు మాయా యుద్ధం ప్రారంభించే సరికి దుర్యోధనుడి సైనికులు పారిపోసాగారు. దుర్యోధనుడి తమ్ములు వాళ్ళను మళ్ళించటం మొదలుపెట్టారు. కర్ణుడు ఒకడే ధైర్యంగా నిలబడి పోరాడాడు. కాని గంధర్వ సైనికులు అతని రథాన్ని ముక్కలు ముక్కలు చేశారు. కర్ణుడు విరథుడై, వికర్ణుడి రథమెక్కి పారిపోయాడు. దుర్యోధనుడు గంధర్వులకు దొరికిపోయాడు. చిత్రసేనుడు దుర్యోధనుణ్ణి చంపక పెడరెక్కలు విరిచికట్టి వశపరచుకున్నాడు. అది చూసి మిగిలిన గంధర్వులు దుర్యోధనుడి తమ్ములనూ, వారి భార్యలనూ పట్టి బంధించారు.

తమ నాయకులను గంధర్వులు చెరపట్టి తీసుకుపోతూ ఉండటం చూసి, కౌరవ సైనికులు ధర్మరాజు ఆశ్రమానికి పరిగెత్తి



పోయి అతనితో, "మహాత్మా, కౌరవకుమారులనూ, వారి భార్యలనూ పట్టుకుని గంధర్వులు గంధమాదన ప్రాంతాలకు తీసుకుపోతున్నారు. దయ ఉంచి వారిని విడిపించు," అని మొరపెట్టుకున్నారు.

భీముడీ మాటలు విని, "కాగల పని గంధర్వులే చేశారు! పెద్దపెట్టున సైన్యాలను కూర్చుకుని, యుద్ధం చేసే అవసరం తప్పింది. కష్టాలలో ఉన్న మంచివారికి దేవుడు అలా సాయపడతాడు," అన్నాడు.

ధర్మరాజు భీముణ్ణి మందలిస్తూ, "ఇలా మాట్లాడటానికి ఇదా సమయం? కౌరవులు ఇప్పుడు మనను శరణుజొచ్చారు. వారిని ఆదుకోవటం మన ధర్మం. మన జ్ఞాతుల



భార్యలకు అవమానం జరిగితే మనకు అవమానం కాదా? నేను యజ్ఞదీక్షలో ఉన్నాను గనక, నువ్వూ, అర్జున నకుల సహదేవులూ, మన పరివారాన్ని వెంటబెట్టుకుని గంధర్వులను వెన్నంటి వెళ్ళి, కౌరవుల భార్యలను విడిపించండి. తొందరపడి గంధర్వులతో యుద్ధానికి దిగవద్దు. వీలయితే మంచి మాటలతో పనిచేసుకు రండి. అది సాధ్యం కాకపోతేనే యుద్ధం చెయ్యండి. జ్ఞాపకం ఉంచుకోండి: మన మధ్య కయ్యం వస్తే వారు నూరుగురూ, మనం అయిదుగురమూ; కాని పైవాళ్ళతో కయ్యం వస్తే మనం నూట అయిదుగురం!" అన్నాడు.

అర్జునుడు ధర్మరాజు చెప్పినట్టే చేస్తామని, భీమ నకుల సహదేవులతో యుద్ధానికి సిద్ధమై, వేగంగా పరిగెత్తే రథాలెక్కి, గంధర్వులు వెళ్ళిన దారిన బయలుదేరాడు. కౌరవ సైనికులకు ప్రాణాలు లేచివచ్చాయి.

పాండవులు తమను వెన్నంటి వస్తున్న సంగతి తెలిసి గంధర్వులు ఆగారు. అర్జునుడు వారిని సమీపించి, "ఓ గంధర్వులారా, మీరు పట్టుకు పోతున్న దుర్యోధనుడు మా సోదరుడు. అతన్ని విడిచిపుచ్చండి. ఇది మా అన్న అయిన ధర్మరాజు కోరిక," అన్నాడు.

"ఇలా చేయమని మాకు దేవేంద్రుడి ఆజ్ఞ. ఆయన ఆజ్ఞ పాలించటం మా ధర్మం," అన్నారు గంధర్వులు.

"స్త్రీలను గంధర్వరాజు చెరపట్టటం చాలా అనుచితం. మా మాట విని దుర్యోధనుడు మొదలైనవారినీ, వారి భార్యలనూ విడిచిపెట్టండి. మంచిగా మీరు అలా చేయకపోతే, మీతో యుద్ధం చేసి మావారిని మేము విడిపించుకోవలసి వస్తుంది." అన్నాడు అర్జునుడు.

అయితే గంధర్వులు మంచి మాటలకు లొంగక యుద్ధానికి సిద్ధమయారు.

పాండవులకూ, గంధర్వులకూ యుద్ధం ప్రారంభమయింది. దుర్యోధనుణ్ణీ, అతని తమ్ముళ్ళనూ పట్టుకున్నట్టే, పాండవులను

కూడా పట్టుకోవాలని గంధర్వులు ఆ పాండవులను చుట్టుముట్టారు. కాని పాండవుల మీద ఈ ఎత్తు పారలేదు. అర్జునుడు గంధర్వ సైనికులను తన బాణాలతో తీవ్రంగా గాయపరచసాగాడు; వాళ్ళు తనపై విసిరిన ఆయుధాలను మధ్య దారిలో విరగగొట్టాడు.

యుద్ధం మధ్యలో చిత్రసేనుడు, "అర్జునా, నన్ను గుర్తించలేదా? నేను చిత్రసేనుణ్ణి. నీ స్నేహితుణ్ణి. ఈ దుర్మార్గుడైన దుర్యోధనుడు మీకూ, ద్రౌపదికీ తన వైభవం ప్రదర్శించి, బాధించటానికి ఘోష యాత్ర నెపంతో తన పరివారాన్ని వెంట బెట్టుకుని ద్వైతవనానికి బయలుదేరాడు. అది తెలిసి దేవేంద్రుడు వీళ్ళందరినీ పట్టి, స్వర్గానికి తీసుకు రమ్మని నన్ను పంపాడు. అందుచేత ఆయన ఆజ్ఞ నిర్వర్తిస్తున్నాను," అన్నాడు.

దానికి అర్జునుడు, "ఇతను దుర్మార్గుడే గాని, మా దాయాది. ఇతన్ని విడిపించుకు రమ్మని మా ధర్మరాజు మమ్మల్ని ఆజ్ఞాపించాడు. నువు మా ధర్మరాజు దగ్గిరికి వచ్చి ఆయన చెప్పినట్టు చేస్తే బాగుంటుంది. నీ మిత్రుణ్ణిగానూ, శిష్యుణ్ణిగానూ ఈ మాట అడుగుతున్నాను," అన్నాడు.

చిత్రసేనుడు అర్జునుడు మొదలైన వారి వెంట ఆశ్రమానికి వచ్చి, ధర్మరాజుతో జరిగినదంతా చెప్పాడు. అంతా విని ధర్మరాజు, "గంధర్వరాజా, మీరు దుర్యోధనుణ్ణి చంపకపోవటం నిజంగా మా అదృష్టం. మా కులానికి గొప్ప ఆపద తప్పింది. మిమ్మల్ని చూడటం నా కెంతో సంతోషంగా ఉంది. మీరు నా విన్నపం మన్నించి దుర్యోధనాదుల నందరినీ విడిచి పుచ్చండి," అని వేడుకున్నాడు.

చిత్రసేనుడు ధర్మరాజు కోరినట్టే కౌరవులను విడిచిపుచ్చి, సపరివారంగా స్వర్గానికి వెళ్ళిపోయాడు.

తరవాత ధర్మరాజు దుర్యోధనుణ్ణి దగ్గిరికి పిలిచి, "బాబూ, ఎప్పుడూ ఇలాటి సాహసం చేయకు. అందువల్ల సుఖం కలగదు. జరిగిన దానికి విచారించక, అంతఃపుర స్త్రీలతో ఇంటికి తిరిగి వెళ్ళు." అన్నాడు.





# శివపురాణం

## 10

పార్వతీ కల్యాణం సందర్భంలో హిమవంతుడు పంపిన ఆహ్వానం అందుకుని, ఆయన బంధువులూ, మిత్రులూ సకుటుంబంగానూ, సపరివారంగానూ రావటం మొదలు పెట్టారు. వారు తమ వెంట బంగారు తామర పుష్పాలూ, ముత్యాలూ, మాణిక్యాలూ, పగడాలూ మొదలైన కానుకలు తెచ్చారు. వేరు వేరు పర్వతాల రాజులు నవరత్నాలనూ, చందనం మొదలు గాగల సుగంధ ద్రవ్యాలనూ, మదించిన ఏనుగులనూ, సైంధవాశ్వాలనూ కానుకలుగా తెచ్చారు. హిమవంతుడా కానుకలను స్వీకరించి, అతిథులకు గౌరవ మర్యాదలు చేశాడు, వారికి విడుదులు ఏర్పాటు చేశాడు.

వచ్చేవారికి విడుదులు తయారు చెయ్యటానికీ, పదివేల యోజనాల నిడివి గల కల్యాణ మంటపం నిర్మించటానికీ హిమవంతుడు విశ్వకర్మ సహాయం పొందాడు. హిమవంతు డుండే ఓషధీపురాన్ని అద్భుతంగా అలంకరించారు.

కైలాసంలో శివుడు, హిమవంతుడు పంపిన లగ్నపత్రిక అందుకుని సంతోషించి, వాయుదేవుణ్ణి పంపి నారదుణ్ణి పిలిపించాడు. నారదుడు వచ్చి, తనను పిలిపించిన కారణం అడిగాడు.

"నారదా, ఇంకా అయిదు రోజులలో నాకూ, హిమవంతుడి కూతురైన పార్వతికీ వివాహం జరగనున్నది. వ్యవధి ఆట్టే లేదు. నువు కామగమనం గల వాడివి గనక, మూడులోకాల వారినీ వివాహానికి ఆహ్వానించి రావాలి. కుబేరుడు మొదలైన వారితో పెళ్ళికి కావలసిన సరంజామా అంతా తీసుకు రమ్మని చెప్పాలి," అని శివుడు నారదుడితో అన్నాడు.

అట్ట చివరి బొమ్మ



నారదుడు అందుకు సంతోషంగా ఒప్పుకుని, శివుడి వద్ద సెలవు పుచ్చుకుని, బ్రహ్మ విష్ణు దేవేంద్రాది దేవతలతోనూ, భూలోకంలోనూ, నాగలోకంలోనూ ఉండే వారితోనూ, "మాఘ శుద్ధ ఏకాదశి నాటి రాత్రి తెల్లవారుఝామున శివ పార్వతులకు వివాహం జరుగుతున్నది. మీరందరూ రావాలి," అని చెప్పాడు. తరవాత ఆయన కుబేరుణ్ణి వెంట బెట్టుకుని, వివాహానికి కావలిసిన వస్తువులన్నిటితోనూ కైలాసానికి తిరిగి వచ్చాడు.

శివ పార్వతుల వివాహం చూడటానికి శివుడి ఆహ్వానం పొందిన బ్రహ్మవిష్ణువులూ, దేవేంద్రుడూ, ఇతర దేవతలూ, మహర్షులూ కైలాసానికి రాసాగారు. నందీశ్వరుడూ, రుద్రగణాల వాళ్ళూ అతిథులను గౌరవించి, వారికి తగిన ఇళ్ళూ, వసతులూ ఏర్పాటు చేశారు.

శివుడి పెళ్ళికి బ్రహ్మ పురోహితుడుగానూ, విష్ణువు బావమరిదిగానూ, ఇంద్రాది దేవతలూ, ఋషులూ సదస్యులుగానూ ఉండేటట్టు నిర్ణయమయింది. శివుడికి మంగళాభిషేకం చెయ్యటానికి బృహస్పతి ముహూర్తం నిర్ణయించాడు. ఆ ముహూర్తాన, గరుడ గంధర్వ యక్షస్త్రీలూ, సప్త మాతృకలూ, లక్ష్మి, సరస్వతి, శచీ, అరుంధతీ లాటి మహా పతివ్రతలూ శివుడి చేత స్నానం చేయించి, హరిచందనం లాటి పూతలు పూసి, కంఠహారాలు వేసి పెళ్ళికొడుకును చేశారు. గౌతముడూ, అత్రీ, భృగువూ మొదలైన మహర్షులు శివుడి కుడి చేతికి శాస్త్రోక్తంగా దీక్షాబంధం కట్టి, నవగ్రహ పూజలు జరిపించారు.

తరవాత బ్రహ్మ ఆజ్ఞాపించగా, శివుడు తన పక్షం వారి నందరినీ కలుపుకుని, మంగళ వాద్యాలతోనూ, నృత్యాలతోనూ ఓషధీపురానికి బయలుదేరాడు. కైలాసానికి రక్షకులుగా రుద్రగణాల నాయకులను ఉంచి, నందీశ్వరుడు ప్రమథగణాలనన్నిటినీ పెళ్ళికి తరలించుకు వచ్చాడు. వీరభద్రుడూ, చండీశ్వరుడూ, భైరవుడూ,

నందీశ్వరుడూ తమ తమ వాహనాల మీద బయలుదేరారు.

పెళ్ళి కొడుకైన శివుణ్ణి ఐరావతం మీద కూర్చోబెట్టారు. సరస్వతీ బ్రహ్మలు హంస మీదా, లక్ష్మి విష్ణువులు గరుడుడి మీదా, శచీ ఇంద్రులు కదిలే సింహాసనం మీదా ప్రయాణం చేశారు. కుబేరుడు నవనిధులతో శివుడి వెనక కూర్చున్నాడు. దేవతా స్త్రీలూ, ఋషిపత్నులూ, అప్సరసలూ దివ్య వస్త్రాలనూ, సుగంధ ద్రవ్యాలనూ తీసుకుని విమానాలలో బయలుదేరారు.

పెళ్ళివారు నగరం సమీపిస్తూ ఉండగా హిమవంతుడు తన పురోహితుడైన గర్గమహాముని నీ, మేనకనూ, కొడుకులనూ వెంట బెట్టుకుని, మేళతాళాలతో ఎదురు వచ్చి, బ్రహ్మ విష్ణు దేవేంద్రులకూ, ఋషులకూ నమస్కారం చేసి, శివుడి ముందు చేతులు మోడ్చి నిలబడి, "సర్వేశ్వరుడవైన నీ వల్ల నేను గొప్పవాణ్ణి అయాను. పెళ్ళి కొడుకువై నా యింటికి వచ్చిన నీకు నా కుమార్తె నిచ్చి వివాహం చేస్తాను. నువు ఆమెను వివాహమాడి నన్నూ, నా వంశాన్నీ పవిత్రం చెయ్యవలసిందని ప్రార్థించుతున్నాను," అన్నాడు. ఆయన శివుడికి బట్టలూ, గంధ పుష్పతాంబూలాలూ ఇచ్చి, అందరికీ పాలూ, పానకాలూ ఇచ్చి, శ్రమ నివారణకు వింజామరలు వీయింపజేశాడు.



హిమవంతుడి పక్కవు స్త్రీలు శివుణ్ణి చూసి, "మన పార్వతి అదృష్టవంతురాలు! కోటి మన్మథులకు సమానమైన భర్త ఆమెకు లభించాడు," అనుకున్నారు. మేనక శివుడి ముందు చేతులు జోడించి, "సదాశివా, కిట్టనివాళ్ళు చెప్పిన మాటలు విని నిన్ను నిందించాను. నా తప్పు మన్నించి, మా ఇంటికి వచ్చి, మేము చేసే వరపూజలు గ్రహించి, మా పార్వతిని వివాహం చేసుకో," అన్నది. పెద్ద ముత్తయిదువులు వచ్చి శివుణ్ణి దీవించారు.

దారిపొడుగునా పుష్పాలూ, ముత్యాలూ, అక్షింతలూ చల్లుతూ, మేనకా హిమవంతులు శివుణ్ణి విడిదికి తీసుకుపోయి, వర

పూజ చేసి, పెళ్ళికొడుకు పరివారానికి ఏ లోటూ లేకుండా ఏర్పాటు చేసి, తమ ఇంటికి తిరిగి వచ్చారు.

కులాచారం ప్రకారం పార్వతి అంబిక ఆలయానికి వెళ్ళి, ఆ దేవిని పూజించింది. ముత్తయిదువులు వెంటరాగా పల్లకీ ఎక్కి పార్వతి ఆలయానికి వెళ్ళేటప్పుడు దేవతలు ఆమెను చూసి, "ఈమె పరదేవతే! ఈమెకూ, శివుడికీ పెళ్ళి జరిగితే మన కష్టాలు తీరుతాయి," అనుకున్నారు.

పార్వతి అంబికపూజ చేసి తిరిగి వచ్చే సరికి ముహూర్తం దగ్గిరపడింది. శివుణ్ణి ఐరావతం మీద కల్యాణమంటపానికి తీసుకు వచ్చి, పీటల మీద కూర్చోబెట్టారు. మేనకా హిమవంతులు అల్లుడి కాళ్ళు కడిగి, నెత్తిన చల్లుకున్నారు. వాళ్ళు పార్వతి చేతిని శివుడి చేతిలో పెట్టి కన్యాదానం చేశారు.

శివపార్వతుల పెళ్ళి అత్యంత వైభవంగా జరిగిపోయింది. దేవతలు శివుడి అనుమతి పొంది తమ తమ నివాసాలకు వెళ్ళిపోయారు. శివుడు హిమవంతుడి ఇంట చాలా కాలం ఉన్నాడు. ఆయనకు కైలాసానికి వెళ్ళి పోవాలనిపించి, నందీశ్వరుడి చేత మేనకా హిమవంతులకు ఆ మాట చెప్పించాడు.

మేనకా హిమవంతులు పార్వతిని శివుడి వెంట పంపటానికి సన్నాహాలన్నీ చేశారు. ఆమెకు బట్టలూ, పరిచారికలూ, గృహోపకరణాలూ, ఆమె ఎక్కి తిరిగిన సింహమూ మొదలైనవి అరణంగా ఇచ్చి, శివుడికి అప్పగించి, "పార్వతిని ప్రేమగా చూసుకో," అని చెప్పారు. పెద్ద ముత్తయిదువులు పార్వతికి చెప్పవలసిన నీతులన్నీ చెప్పారు.

ప్రయాణానికి మంచి ముహూర్తం చూసుకుని, పార్వతితో సహా కైలాసానికి తిరిగి వచ్చి, మహర్షుల సహాయంతో శివుడు గృహప్రవేశం చేశాడు. మూడు రోజుల పాటు శివుడి ఇంట విందులు జరిగాయి. తరవాత బ్రహ్మ, విష్ణువూ, మిగిలినవారూ శివుడితో వెళ్ళివస్తామని చెప్పారు. శివుడు వారికీ, తన ఆహ్వానం అందుకుని వచ్చిన వారందరికీ తగిన కానుకలు ఇచ్చి గౌరవించి పంపేశాడు.



# 120. "స్పాంజి" వేట

"స్పాంజి" అనేది సముద్రప్రాణి. కాని దానిని చూసి ఎవరూ ప్రాణి అనుకోరు. దానికి అంగాలుండవు, తల ఉండదు, రక్తప్రసారం ఉండదు; కాని అది పెరుగుతుంది, పిల్లలను పెడుతుంది, ఆహారం తీసుకుంటుంది. జీవించి ఉన్నప్పుడు దానిని ఒక నల్లని పలచని, పొరలాటి చర్మం కప్పి ఉంటుంది. దానిలోపలి భాగమంతా పీచులాగా ఉంటుంది.

స్పాంజీలలో చాలా రకాలున్నాయి. వాటిలో కొన్ని మాత్రమే విలువైనవి. వాటిని మనుషులు సముద్రం అడుగుకుదిగి, ముత్యపుచిప్పలను తెచ్చినట్టు, పైకి తెస్తారు. స్పాంజీలు సముద్రం అడుగున రాళ్ళకు కరుచుకుని ఉంటాయి. వాటిని ముళ్ళ పారలతో తవ్వి తీస్తున్నవాడి బొమ్మ ఇక్కడ ఉన్నది. ఈ బొమ్మలో, పని చేసేవాడు గాలి పీల్చేగొట్టమూ, అతన్ని తిరిగి పడవలోకి చేదుకునే మోకూ కనిపిస్తాయి



Photo by M. Yasawant Bendre



బహుమతి
పొందిన వ్యాఖ్య

పిల్లల పండుగ రేపే

పంపినవారు :
హెచ్. రాధ

Photo by Prabhakar Mahadik




బండిమెట్ట,
కర్నూలు

నెహ్రూ బహుమతి నాకే

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







★ వ్యాఖ్యలు నవంబర్ నెల 10 వ తేదీ లోగా చేరాలి.

★ వ్యాఖ్యలు ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలోగాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు జనవరి సంచికలో ప్రకటించబడును.

# చందమామ

### ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట: చింపాంజీలు

మూడవ అట్ట: మకాచిలుకలు


Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

పుల్లని, తియ్యని
నారింజపళ్లు బోలెడు తెచ్చి,
రసాలు పిండి చేశా చూడు

# న్యూట్రిన్ ఆరెంజ్ క్యాండి





నిజానికి పిల్లలూ! ఈ న్యూట్రిన్
ఆరెంజి క్యాండీలు అసలు నారింజ
తొనలను మించి రుచించు,
నువ్వు తిని నీ వాళ్లను తినిపించు!

ఒక్కొక్క మిఠాయి యందు
ఫలరస పూరిత విందు!




న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్,
చిత్తూరు (ఆం.ప్ర)

# వివా

రెండు విధములుగా ఆరోగ్యమును కలిగించే పానీయము

## పగలంతా ఎంతో శక్తి...
## రాత్రంతా సుఖమైన విశ్రాంతి





వివా త్రాగండి—వేడిగా లేక చల్లగా, నీళ్లలో లేక పాలలో మాల్ట్, గోధుమ మరియు ప్రోటీనులతో పుష్టివంతముగా చేయబడినదే వివా. అది స్నాయువులను బలపరుస్తుంది, నరములకు ఉపశమనమును కలిగిస్తుంది, కండరములకు సేదదేరుస్తుంది.

ప్రొద్దున్న వివా త్రాగితే రోజంతా ఉత్సాహముగా ఉంటారు!
రాత్రి వివా త్రాగితే గాఢముగా నిద్రపడుతుంది!
వివా సులభముగా జీర్ణమవుతుంది. అది రోగులకు, రోగము నుండి కోలుకొంటున్న వారికి ప్రత్యేకముగా సిఫార్సు చేయబడినది.

***రుచిగా ఉంటుంది కమ్మగా—***
***జీర్ణమవుతుంది త్వరగా***







సోల్ సెల్లింగ్ ఏజెంట్లు :
వోల్టాస్ లిమిటెడ్

Shilpi-JI-3C/71 TEL.

# సంచలనము కలిగించే వార్త!

4 సరిక్రొత్త వివిధ సేవింగ్స్ పథకములను బ్యాంక్ ఆఫ్ బరోడా ప్రవేశపెడుతోంది. మీకు అందులో ఒకటి తప్పకుండా నచ్చుతుంది. జాగ్రత్తగా ఆలోచించి ప్రవేశ పెట్టిన యీ పథకములు మీరు ఆదా చేయుటను ఎంత సులభము లాభసాటి చేస్తాయో చదివి చూడండి.

**1. ఫెస్టివల్ డిపాజిట్ పథకము**

దీపావళి, క్రిస్టమసు, ఈద్, పొంగలి, సంక్రాంతి, దసరా పండుగల్లో ఏ పండుగనైనా మీరు వేడుక వినోదములతో జరుపుకొనుటకు మీ చేతిలో పుష్కలముగా డబ్బు ఉండేలా చూసుకోండి. మీ యిష్టము వచ్చిన పండుగకు ఒక ఏడాది ముందుగా మీరు రు. 25/-తో (వీలైతే యింకా ఎక్కువతో) నెలనెలా డబ్బు కట్టండి. పండుగ సమయమునకు మీ డబ్బు, దానిమీద మంచి వడ్డీ మేమిచ్చే పండుగ బహుమానము కూడ అందుకోండి.

**2. మంత్లీ ఇన్‌కమ్ పథకము**

మీరు ఫిక్స్‌డ్ డిపాజిట్లలో డబ్బు పెట్టినా, దానిమీద వడ్డీ మీకు ప్రతి నెలా కావాలా? ఈ క్రొత్త పథకమును చూడండి. కనిష్ఠ మొత్తము: రు. 5000. కనిష్ఠ కాలము: 2 సంవత్సరములు. మూల ధనము మీద వడ్డీ మీకు కాని, కావాలంటే వేరొకరికి కాని క్రమంగా ప్రతి నెలా యివ్వబడుతుంది.

**3 రూరల్ సేవింగ్స్ పథకము**

మీకు 6 నెలలకు లేక ఏడాదికి రాబడి వచ్చే మార్గముండి, దానిమీద చక్కని వడ్డీ సంపాదించుకోవాలంటే, యీ పథకము మీకు నచ్చుతుంది. మీకు రు. 100 లేక ఎక్కువ మొత్తమును 6 నెలల లేక ఏడాది వాయిదాలలో కనిష్ఠము 3 సంవత్సరములు డిపాజిట్ చేయండి. మీరు కట్టిన డబ్బు, దానిమీద చివరకు వచ్చే వడ్డీ పెద్ద మొత్తము అయి మీ పిల్లల పెళ్లి వంటిసమయమునకు వరప్రసాదముగా ఉంటుంది.

**4. పీపుల్స్ సేవింగ్స్ పథకము**

మీ డబ్బును చాల కాలపు ఫిక్స్‌డ్ డిపాజిట్‌లో పెట్టడము యిష్టము లేదా? ఈ 12 నెలల డిపాజిట్ పథకములో పెట్టుబడి పెట్టి, హెచ్చు వడ్డీని కూడ సంపాదించండి. డిపాజిట్ మొత్తము: రు. 500—50,000 ప్రారంభించిన మూడవ నెల నుండి మీ డిపాజిట్టు మొత్తములో 10% వరకు నెలనెలా డబ్బు తీసుకోవచ్చును.




పూర్తి వివరములకు మీ దగ్గరలోనున్న బ్యాంక్ ఆఫ్ బరోడా ఏజెంటును సంప్రదించండి.

సిరిసంపదలకు అక్షయ పాత్ర

## బ్యాంక్ ఆఫ్ బరోడా

హెడ్ ఆఫీస్: మాండ్వీ, బరోడా.

550 పైగా బ్రాంచీలతో భారతదేశములో దాదాపు ప్రతి స్టేటులోను సేవ చేస్తోంది.

ఇంకా: యు.కె., తూర్పు ఆఫ్రికా, మారిషస్, ఫిజీ ద్వీపములు మరియు గియానాలలో బ్రాంచీలు కలవు.

Shilp- BOB 4A/71 Tel

